# రామ్, శ్యామ్

## అడవి మనుషులతో అనుభవం


























కళ్యాణ ఘడియలు కంటికి సొంపు, క్వాలిటీ ఐస్‌క్రీమ్స్ నోటికి ఇంపు

ఇంపు సొంపైన క్వాలిటీ వారి 'బటర్‌స్కాచ్' మరియు 'రెయిన్‌బో' కప్స్

# క్వాలిటీ ఐస్‌క్రీమ్స

వి.బి.సి. ఫుడ్స్ ప్రైవేట్ లిమిటెడ్.

ఫోన్లు: హైదరాబాదు: 263287, విజయవాడ: 58351, విశాఖపట్టణం: 69397, కాకినాడ: 6525, గుంటూరు: 33588, ఒంగోలు: 3171, నెల్లూరు: 4519, తిరుపతి: 2501, రాజమండ్రి: 2199, ఏలూరు: 21670, వరంగల్: 4921 P.P., కరీంనగర్: 3170, నిజామాబాద్: 22226. ఖమ్మం: 3096,

BOMBAY'S

# Kwality

ICE CREAM



LAA

# ఆంప్రో మిల్క్ బేస్
# బడిపిల్లల బిస్కెట్






# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'
సంచాలకుడు : నాగిరెడ్డి

ఈ నెల బేతాళకథ [''మహార్ణరాకుమారి కథ'']కు ఆధారం, లక్ష్మీగాయత్రి రచన. అన్ని ఉత్తమ గుణాలలో, దానగుణం అత్యుత్తమమైనది. ఇతర మంచి గుణాలవల్ల పరులకు కీడు జరగదు; మేలూ జరగదు. కీడు చేయకపోవడం, మేలు చేయడం కాదు గదా! దానగుణం అంటేనే, మనిషి తన శక్త్యనుసారం, ఇతరులకు మేలు చేయడం. ''జ్ఞాపకముండేపని'' అన్న కథలో, యీ వాస్తవం తెలుసుకుంటాం.

## అమరవాణి

పరాచః కామానసుయన్తి బాలాస్తే, మృత్యోర్యన్తి వితతస్యపాశం,
అథధీరా అమృతత్వం విదిత్వా, ధృవమధ్రువేష్విహః న ప్రార్థయన్తే.

[అల్పుడు, అల్పసుఖాలకేసి పరుగులు తీసి మరణమనే వలలో పడతాడు. ధీరుడు, నిత్యానిత్యజ్ఞానం కలవాడు; అందువల్ల అల్పసుఖాల నుంచి శాశ్వతానందాన్ని ఆశించడు!]

సంపుటి 83 అక్టోబర్ '88 సంచిక 4

విడి ప్రతి : 2-50 :: సంవత్సర చందా : 30-00

# చందమామ కబుర్లు



## 'యెతి' అడుగుజాడలు?

హిమాలయ ప్రాంతంలో నివసిస్తుందని చెప్పబడే 'యెతి' అనే మహాప్రాణి వివరాలను సేకరించడానికి పూనుకున్న ఇంగ్లండుకు చెందిన ఒక బృందానికి—పెద్ద పాద చిహ్నాలు కనిపించాయి. "నేపాల్ వాళ్ళందరూ యెతి ఉన్నట్టుగానే భావిస్తున్నారు. మేము అలాంటి ప్రాణిని చూడలేదుగాని, వాళ్ళ మాటల్లో ఎంతో కొంత విషయం ఉందనే అనిపిస్తున్నది." అన్నాడు ఆ బృందానికి చెందిన పెద్దమనిషి।

## తబలా వాయిద్యంలో సరికొత్త రికార్డు

అలీఘర్‌కు చెందిన చందన్ ఛటర్జీ, 25 గంటలసేపు ఏకబిగిని తబలా వాయించి సరికొత్త రికార్డు సృష్టించాడు।





## 'స్ఫింక్స్'కు చికిత్స!

కెయిరో సమీప పిరమిడ్లకు దాపులలో, మనిషితల—సింహం శరీరం గల 'స్ఫింక్స్' బ్రహ్మాండమైన శిలావిగ్రహం దాదాపు 4,600 సంవత్సరాలుగా వుంటున్నది. దీని శరీరంలో అక్కడక్కడా పగుళ్ళు ఏర్పడ్డాయి. ఈ పగుళ్ళను బాగు చేయడానికి భారీఎత్తున ఏర్పాట్లు జరుగుతున్నాయి।

## ప్రపంచం చుట్టివచ్చిన వనిత!

సిడ్నీకి చెందిన మిస్ కోటీ అనే వనిత—చిన్న పడవలో ఒంటరిగా 4,200 కి. మీ., దూరం ఆగకుండా ప్రయాణం చేసి, 189 రోజులలో ప్రపంచాన్ని చుట్టివచ్చింది. ఇలాంటి ఘన కార్యం సాధించిన మొట్టమొదటి వనితగా మిస్ కోటీ చరిత్ర సృష్టించింది।



# సహజత్వం

ఒక నాటకనమాజం వాళ్ళకు, దుర్వాసముని పాత్రధారుడు కావలసి వచ్చాడు. ఆ నంగతి తెలిసి ఐదుగురు నటులు వచ్చారు. నమాజంలో పనిచేసే వాడొకడు, వాళ్ళతో, "మా యజమాని ఏదో పనిలో వున్నారు. ఒక్క పావుగంటలో వస్తారు. కూర్చోండి," అని చెప్పాడు.

నమాజంయజమాని ఆదినారాయణ అనే అతను, గంట తరవాత అక్కడికి వచ్చి, వేషం కోసం వచ్చినవాళ్ళను రకరకాలుగా ప్రశ్నించి, "పనికి రానివాళ్ళందరికీ, మా నమాజంలో వేషాలివ్వడానికి, యిదేం అనాథశరణాలయం అనుకున్నారా ఏం?" అన్నాడు కసురుతున్నట్టు.

ఆ మాటలు విని, వచ్చినవాళ్ళలో నలుగురు నిర్ఘాంతపోయి తలలు వంచుకున్నారు. అయితే, శ్రీహరి అనేవాడు కోపాన్ని ఆపుకోలేక, లేచి నిలబడి, "పావుగంట అని మమ్మల్ని గంట సేపు కూర్చోబెట్టారు. ఇక్కడికి రావడానికి మేం ఎన్ని వ్యయప్రయాసలకు గురయ్యామో తెలుసా? పైగా నభ్యతా నంస్కారం లేకుండా మాట్లాడుతున్నారు," అన్నాడు ఆవేశంగా.

ఆ వెంటనే, నమాజంయజమాని చిన్నగానవ్వి, "దుర్వాసముని ముక్కోపిగదా! అలాంటి నహజత్వం, మీలో ఎవరిలో వున్నదో తెలుసుకునేందుకు అలా మాట్లాడాను. నువ్వా పాత్రకు పనికివసావు." అంటూ శ్రీహరిని ఎన్నుకున్నాడు.

—అరుపల్లి గోవిందరాజులు





# కాళిదాసు పెళ్ళి

శివపురి అనే గ్రామంలో, కాళిదాసు అనే యువకుడుండేవాడు. వాడికి చిన్నతనంలోనే తల్లీ, తండ్రీ పోవడంతో, గ్రామస్థులకు చిన్న చిన్న పనులు చేసి పెడుతూ పొట్ట నింపుకునేవాడు.

ఆ గ్రామంలోనే మల్లన్న అనే వస్తాదున్నాడు. అతడికి, నా అన్నవారెవరూ లేని కాళిదాసంటే వల్లమాలిన అభిమానం. ఆ అభిమానంతో మల్లన్న, కాళిదాసుకు సాముగరిడీ విద్యలు నేర్పాడు. కర్ర సాములో కాళిదాసు అద్భుతమైన ప్రజ్ఞా పాటవాలు సంపాదించగలిగాడు. వాడు కర్ర తిప్పుతూంటే, చూసేవాళ్ళకు దాని శబ్దం వినిపించేదేగాని, కర్ర కనిపించేది కాదు.

యుక్తవయస్కుడైన కాళిదాసుకు, వివాహం చేసుకోవాలన్న ఆలోచన వచ్చింది. కాని, అనాథ, పేదవాడన్న కారణంవల్ల, ఎవరూ అతడికి పిల్లనిచ్చేందుకు యిష్టపడలేదు. తన మంచితనం చూసి, ఎవరో ఒకరు తమ కుమార్తెనిచ్చి పెళ్ళి చేస్తారని ఆశించిన కాళిదాసుకు, అలా జరగకపోవడంతో ఎంతో బాధకలిగింది.

శివపురిగ్రామ జమీందారు పేరు మహానందుడు. ఆయన తన కుమార్తెకు ఘనంగా పెళ్ళి జరిపి, ఆమెను దూర గ్రామంలో వున్న అత్తవారింటికి పంపదలిచాడు. అయితే, ఆ గ్రామ మార్గంలో వున్న చిట్టడవుల్లో బందిపోట్ల బెడద ఎక్కువ.

ఈ పరిస్థితుల్లో, కుమార్తెను విలువైన ఆభరణాలతో, అత్తవారింటికి పంపడం ఎలా అని జమీందారు ఆలోచించసాగాడు. గ్రామపెద్ద, ఆయనతో, ''అమ్మాయి వెళ్ళే మేనా వెంట ఎలానూ, మీ నౌకర్లు కొందరుంటారుగదా. వాళ్ళతోపాటు కాళి

ఎస్. శివనాగేశ్వరరావు



దాసును కూడా పంపండి. వాడు కర్రసాములో మంచి దిట్ట. పదిమంది బందిపోట్లనయినా తరిమికొట్టగలడు," అన్నాడు.

జమీందారు, ఆ విధంగానే చేశాడు. ఆయన భయపడినట్టే, అడవిలో పదిమంది బందిపోట్లు మేనాను అటకాయించారు. వాళ్ళను చూసి జమీందారు నౌకర్లు చెల్లాచెదురుగా పారిపోయారు. అయితే, కాళిదాసు తన బాణాకర్రతో బందిపోట్ల ముందుకు ఉరికి, అందినవాణ్ణి అందినట్టు బలంగా కొట్టసాగాడు. వాడి ధాటికి నిలవలేక బందిపోట్లు పరారయ్యారు.

జమీందారు కుమార్తె క్షేమంగా అత్తవారిల్లు చేరింది. గ్రామానికి తిరిగి వచ్చిన కాళిదాసును అందరూ మెచ్చుకున్నారు. గ్రామపెద్ద, వాడితో, "నీ పంట పండింది! నువ్వు చేసిన సహాయానికి జమీందారుగారు, ధనరూపంలో చాలా పెద్దమొత్తం బహూకరిస్తారు," అన్నాడు.

కాని, జమీందారు కాళిదాసుకు దర్శనం యివ్వకపోగా, నౌకరుచేత వాడికి నాలుగు వరహాలు పంపి ఊరుకున్నాడు. దానితో కాళిదాసుకు మనుషుల మంచితనం మీద పూర్తిగా నమ్మకం పోయింది. వాడు గ్రామం వదిలి మరెక్కడికైనా పోవాలన్న ఆలోచన చేయసాగాడు.

అలాంటి సమయంలో, ఒక రాత్రివేళ వాడి దగ్గిరకు ఒక మనిషి వచ్చి, "నన్ను పోల్చుకున్నావో లేదో—ఆమధ్య అడవిలో నీ బాణాకర్ర దెబ్బలుతిన్న బందిపోట్లలో నేనొకణ్ణి. నీవంటివాడు మాలో చేరితే, నీకూ, మాకూ కూడా లాభమే. దొరికిన సొమ్ములో ఐదోవంతు వాటా యిస్తాము. మాలో చేరు," అని కోరాడు.

డబ్బు ఎలా సంపాయించినా జనం బ్రహ్మరథం పడతారు, అని ఎవరో అన్న మాట, ఆ సమయంలో కాళిదాసుకు గుర్తు వచ్చింది. వాడు దొంగలముఠాలో చేరడానికి సమ్మతించాడు.

ఒకనాడు కాళిదాసు, మిగతా దొంగలతో పాటు, అడవిదారిన పోతున్న ఒక



ప్రయాణీకుణ్ణి అడ్డగించి, "ఉన్న డబ్బంతా అక్కడే పెట్టు!" అని బెదిరించాడు.

ప్రయాణీకుడు ప్రాణభీతితో వణికిపోతూ, తన చేతి సంచీ లోంచి వంద వరహాలు తీసి, కాళిదాసుకు యిస్తూ, "బాబూ, యిది నా కూతురు పెళ్ళికని కష్టపడి సంపాదించి దాచిన డబ్బు. ఇది పోతే, యిక దానికి పెళ్ళియోగం లేనట్టే!" అని కళ్ళనీళ్ళు పెట్టుకున్నాడు.

ఇది చూసి కాళిదాసు జాలిపడ్డాడు. అది గమనించిన మిగతా దొంగలు, "వాళ్ళు అలాగే కళ్ళనీళ్ళు పెట్టుకుంటారు. మనం జాలిపడకూడదు." అన్నారు.

"ఇతను చెప్పేది నిజంలా కనిపిస్తున్నది. సొమ్ముతో సహా వదిలేద్దాం." అన్నాడు కాళిదాసు.

ఇందుకు మిగతా దొంగలు ఒప్పుకోక, "ఈ క్షణమే నీతో తెగతెంపులు చేసుకుంటున్నాం. నీ తిప్పలు నీవుపడు. మాకు మాత్రం అడ్డురాకు," అని వెళ్ళిపోయారు.

ప్రయాణీకుడు ఆపద తప్పినందుకు, కాళిదాసుకు నమస్కరించి, "బాబూ, నన్ను ఆపదలో ఆదుకున్నావు. చూడబోతే మంచివాడిలా వున్నావు. ఈ దొంగలలో ఎందుకు చేరావు?" అని అడిగాడు.

తన మంచితనం, తనకెలాంటి సాయం చేయకపోవడంతో, తాను దొంగలలో కలిసినట్టు కాళిదాసు చెప్పాడు.

అందుకు ప్రయాణీకుడు, "నువ్వనుకున్నది తప్పు. మంచికి అంతా మంచే జరుగుతుంది. మనం తొందరపడకూడదు. నా పేరు వినమ్రుడు. రాజుగారి కొలువులో నౌకరును. నా వెంట వస్తే, అక్కడ నీకేదైనా పని దొరుకుతుందేమో ప్రయత్నిస్తాను," అన్నాడు.

కాళిదాసు, వినమ్రుడితో బయలుదేరాడు. వాళ్ళు కొంతదూరం వెళ్ళాక, ఒక భయంకర దృశ్యం వాళ్ళ కళ్ళపడింది.



కరాళకంఠుడనే రాక్షసుడొకడు. ఎడమ చేత్తో ఒక మనిషిని ఎత్తి పట్టుకుని తినబో తున్నాడు. ఆ మనిషి తాలూకు పంచ కల్యాణి గుర్రం పెద్దగా సకిలిస్తూ, అక్కడి నుంచి పారిపోతున్నది.

అది చూసి వినమ్రుడు వణికిపోతూ, కాళిదాసుతో, "ఆ రాక్షసుడు తినబో తున్నది మరెవరినో కాదు, మా మహారాజు విద్యాధరుడినే!" అన్నాడు.

కాళిదాసు ధైర్యంగా రాక్షసుడికేసి నడి చాడు. కరాళకంఠుడు వికట్టాట్టహాసం చేసి, రాజును వదిలి, "ఒరే, ఎవడివిరా నువ్వు? నన్ను చూసి పారిపోక, ధైర్యంగా నా దగ్గిరికే వస్తున్నావా?" అన్నాడు.

"నేనెవడినైతే నీకేం? ఇలా మనుషు లను చంపితినడం నీచమని నీకు తెలి యదా?" అని అడిగాడు కాళిదాసు, రాక్షసుణ్ణి.

"నేను రాక్షసుణ్ణి. అయితే, కొన్ని నీతి నియమాలున్నవాణ్ణి. రోజు కొక్క మనిషిని మాత్రమే చంపి తింటాను. అందువల్ల నువ్వు బతికిపోయావు. ఇక వెళ్ళు." అన్నాడు రాక్షసుడు.

"నీకలాంటి మంచి నియమమే వుంటే, ఆయన్ని వదిలి నన్ను తిను," అన్నాడు కాళిదాసు.

అందుకు రాక్షసుడు ఆశ్చర్యపోయి, "నీకు ప్రాణం మీద తీపిలేదా?" అని అడిగాడు.

"ఎందుకు లేదు! అయితే, నువ్వు తినబోయేవ్యక్తి, యీ దేశాన్నేలే రాజు, నేను సామాన్య పౌరుడిని. నావంటి వాడి కంటే, దేశాన్నేలే రాజువల్ల పదిమందికీ ప్రయోజనం వుంటుంది," అన్నాడు కాళిదాసు.

రాక్షసుడు, కాళిదాసును పట్టుకుని, "నీధైర్యం, త్యాగగుణం నాకు నచ్చాయి. నీ చివరికోరిక ఏదైనాసరే తీరుస్తాను, కోరుకో!" అన్నాడు.

కాళిదాసు ఒకటి, రెండు క్షణాలు ఆలోచించి, "నాకు చిన్నప్పటి నుంచీ



కర్రసామంటే ప్రాణం. ఒకసారి బాణా కర్రతో సాముచేయనియ్యి.'' అని కోరాడు.

రాక్షసుడు సరేనన్నాడు. కాళిదాసు బాణాకర్ర తీసుకుని గాలిలో తిప్పసాగాడు. శబ్దం తప్ప కర్ర కనిపించడం లేదు!

అది చూసి రాక్షసుడు ఆశ్చర్యపోయి, ''కర్రసాములో నీ ప్రావీణ్యం అద్భుతం. నాకు నేర్పగలవా ?'' అని అడిగాడు.

కాళిదాసు, రాక్షసుడికి కర్ర ఎలా పట్టుకోవాలో, దాన్నెలా తిప్పాలో—ఆ తిప్పడంలోని మెళుకువులు వాడికి అర్థమయ్యేరీతిలో చెప్పాడు.

రాక్షసుడు సంతృప్తిచెంది, కాళిదాసుతో, ''నువ్విప్పుడు, నాకు గురువువు. గురుదక్షిణ ఏం కావాలో కోరుకో.'' అన్నాడు.

''ఇక నుంచి జంతుమాంసంతో నే కడుపు నింపుకుని బ్రతుకు. మనుషులను చంపకు. అదే నేను కోరే గురుదక్షిణ!'' అన్నాడు కాళిదాసు.

అందుకు రాక్షసుడు కొంచెంసేపు మౌనంగా వూరుకుని, ''నువ్వు కోరే గురుదక్షిణ, నాకు చాలా కష్టసాధ్యమైనది. సరే, మనిద్దరం ఒక ఒప్పందానికి వద్దాం. నీకు, నేను మరొక కానుక యిద్దామనుకుంటున్నాను. అది నీవు వద్దనగలిగితే, నువ్వు కోరిన విధంగా నరమాంసభక్షణ మానివేస్తాను.'' అని కాళిదాసునూ, రాజునూ దాపులనున్న ఒక గుహలోకి తీసుకుపోయాడు.

అక్కడ ఎన్నో బంగారు ఆభరణాలు రాసులుగా పోసి వున్నవి. రాక్షసుడు, కాళిదాసుతో, ''వీటిని నీకు దక్షిణగా సమర్పిద్దామనుకుంటున్నాను. ఇప్పుడు చెప్పు! నిన్ను భాగ్యవంతుణ్ణి చేసే, యీ ధనరాసులను గురుదక్షిణగా స్వీకరిస్తావా ? లేక నీకే మాత్రం ప్రయోజనం కలిగించని, ఆ మొదటి కోర్కె కోరతావా ?'' అన్నాడు.

కాళిదాసు చిన్నగా నవ్వి, ''ఈ ధనరాసులను చూసి నేను ప్రలోభపడతానను

కున్నావా? నువ్వు నరమాంసం మాని వేయడమే, నాకివ్వగల గురుదక్షిణ." అని జవాబిచ్చాడు.

అతని మాటలకు రాక్షసుడు తృప్తిగా తలాడించి, "నేనాడి తప్పను; అలాగే చేస్తాను. అయితే ఒక్కమాట. మీ మానవులు చపలచిత్తులు ఏనాడైనా నీవు నా దగ్గిరకు వచ్చి, ఓడిపోయానని ఒప్పుకున్నా, నీకీ బంగారం యిచ్చివేసి, తిరిగి నేను నరమాంస భక్షణకు పూనుకుంటాను. అంతేకాదు, రాజ్యం మీద పడి దొరికిన వాళ్ళను దొరికినట్టు చంపుకుతింటాను." అన్నాడు.

"ఆ పరిస్థితి ఎన్నటికీ రానీయను!" అని కాళిదాసు రాక్షసుడితో చెప్పి, రాజూ, విన్రములతో కలిసి బయలుదేరి రాజధానీ నగరం చేరాడు.

రాజు విద్యాధరుడు, కాళిదాసు గురించి పూర్తిగా విని, ఎంతగానో సంతోషించి అతడికి తన ఏకైకపుత్రికనిచ్చి వివాహం చేయదలిచాడు.

ఇందుకు రాణి అభ్యంతరం చెప్పగా, ఆయన, "కాళిదాసు అన్ని విధాలా మనకు అల్లుడు కాదగినవాడు. అతడికి మంచితనం మీద నమ్మకం పోవడం వల్లనే, దొంగలలో చేరాడు. అయినా ఆ మంచితనం చెడును అడ్డినందువల్ల, మన నౌకరును దొంగల బారినుంచి కాపాడాడు. నన్ను రాక్షసుడి బారినుంచి కాపాడేందుకు, తన ప్రాణాలను ఒడ్డాడు. ధనరాసులకన్న, ప్రజల ప్రాణాలు ముఖ్యం అన్న నమ్మకం కొద్దీ, రాక్షసుడివ్వజూపిన బంగారాన్ని నిరాకరించాడు. ఇంతకంటే, యీ దేశానికి భవిష్యత్తులో కానున్న రాజుకు కావలసిన అర్హతలేమిటి?" అని ప్రశ్నించాడు.

ఇది విన్న రాణికి, తన కుమార్తెకు కాళిదాసుకన్న ఉత్తమ వరుడు లభించడన్న నమ్మకం కలిగింది.

ఆ తర్వాత కొద్ది రోజుల్లోనే రాజకుమార్తెతో, కాళిదాసుకు అత్యంత వైభవంగా వివాహం జరిగింది.





# జ్ఞాపకముండేపని

జగన్నాథం అనే ధనవంతుడు, ప్రతి సంవత్సరం తన నౌకరు జోగయ్యను వెంటబెట్టుకుని, పక్క ఊళ్ళో జరిగే అమ్మవారి జాతర చూడడానికి వెళుతూండేవాడు.

జాతర చూడడానికి వచ్చే యాత్రికుల సంఖ్య ప్రతి సంవత్సరం పెరుగుతూండడం, జోగయ్య గమనిస్తూండేవాడు. ఆ ఊళ్ళో యాత్రికులకు ఎలాంటి సౌకర్యాలూ లేవు. వాళ్ళు నానా యిబ్బందులకూ గురి అవుతూండడం జోగయ్యకు బాధకలిగిస్తూండేది.

ఒక సంవత్సరం, జాతర జరుగుతూండగా జోగయ్య, అక్కడి గుడి ధర్మకర్తను కలుసుకుని, "అయ్యా, నాదగ్గిర కూడబెట్టిన డబ్బు కొద్దిగా వున్నది. నేను బతికినన్నాళ్ళు బతకకపోవచ్చు. నేను కూడబెట్టిన డబ్బు అవసరమూ, నాకుండకపోవచ్చు. కనక, ఈ డబ్బు వచ్చినన్నాళ్ళు, జాతర్లలో చలివేంద్రాలు తెరిపించి, యాత్రికులకు సాయపడండి," అని ఒక డబ్బు సంచీ ఆయన చేతిలో పెట్టాడు.

జోగయ్య చేసిన, ఈ సత్కార్యం గురించి నలుగురూ చెప్పుకోవడం మొదలై, అది జగన్నాథం చెవిన పడడం జరిగింది. వెంటనే ఆయన ఊళ్ళోని పెద్దలందరినీ పిలిపించి, తను త్వరలోనే అన్ని సదుపాయాలతో ఒక సత్రాన్ని, జాతరకు వచ్చే యాత్రికులకోసం అక్కడ కట్టించబోతున్నట్టు చెప్పాడు.

జగన్నాథం ఔదార్యాన్నీ, దానగుణాన్నీ ఊళ్ళోవాళ్ళందరూ ఎంతగానో మెచ్చుకున్నారు.

ఇది జరిగిన కొన్నాళ్ళకు, జోగయ్య జబ్బుచేసి చనిపోయాడు. ఆ మరుసటి

జొన్నలగడ్డ రత్న

సంవత్సరం జగన్నాథం ఒక్కడే పక్క ఊరి జాతరకు వెళ్ళాడు. ఆ ఊళ్ళో వాళ్ళు, ఆయన్ని పలకరించి, "మీ నౌకరు జోగయ్య ఎంతటి పుణ్యాత్ముడు! అతడు దానంచేసిన డబ్బుతో, జాతరకు వచ్చిన వందలాదిజనం, చలివేంద్రాల్లో దాహం తీర్చుకుంటున్నారు," అని జోగయ్య ధర్మగుణం గురించి గొప్పగా పొగడసాగారు.

వాళ్ళ మాటలు జగన్నాథానికి కోపంతో పాటు, ఎంతో అసూయను కూడా కలిగించాయి. ఆయన చిరాకుపడుతూ, "చలివేంద్రాలు పెట్టించినందుకే, చనిపోయిన ఆ జోగయ్య, మీకింతగా గుర్తున్నాడా?" అని అడిగాడు.

"అవును, జోగయ్య డబ్బివ్వకపోతే యిక్కడ చలివేంద్రాలుండేవా? కావాలంటే గుడి ధర్మకర్తగారి నడగండి," అన్నాడొకడు.

అందుకు జగన్నాథం ఎంతో విసుగ్గా ముఖంపెట్టి, "ఆ సంగతి నేనెరగందికాదు. నేనిక్కడ ఒక పెద్ద ధర్మసత్రమే కట్టిద్దామనుకుంటున్నవాడిని. ఏదో మాట వరసకు అడుగుతున్నాను. రేపు నేను చనిపోయాక, నన్ను గురించి మీరనుకోబోయేదేమిటో కూడా ఇప్పుడు వినాలని వున్నది," అన్నాడు.

అప్పుడు జనంలోనుంచి, ఒక వృద్ధుడు ముందుకువచ్చి, "అయ్యా, చనిపోయిన ఒక మనిషిని గురించిన ప్రస్తావన వచ్చినప్పుడు, అతడు చేసిన మంచిపని, అది ఎంత చిన్నదయినా లోకులు ఎప్పటికీ కృతజ్ఞతతో గుర్తు చేసుకుంటూనే వుంటారు. అంతేకాని, అతడు చేద్దామనుకున్న పెద్ద పనుల గురించి మాత్రం కాదు!" అన్నాడు.

జగన్నాథానికి, వృద్ధుడి మాటల్లోని వ్యంగ్యం అర్థమయింది. ఆ సంవత్సరమే ఆయన, ఆ ఊళ్ళో సకల సదుపాయాలతో చక్కటి సత్రాన్ని కట్టించి, తను ప్రజలమధ్య చేసిన వాగ్దానం నిలబెట్టుకున్నాడు.






## 12

[యువరాణి సహాయంతో. వినోదుడు నక్షత్రఫలం తిని, దేవతదర్శనం కోసం, ప్రకృతి విలయ తాండవం చేసే మార్గంగుండా పయనించి, తటాకమధ్యంలోని చెట్టు తొర్రలో దిగి, మరొక నూతన ప్రదేశాన్ని చేరుకున్నాడు. అక్కడ ఒక వృద్ధపూజారి కనిపించి, విశేషాలు వివరించి, దేవతను మూడు వరాలు మాత్రమే కోరాలని వినోదుణ్ణి ఆదేశించాడు. —తరవాత]

క్రమక్రమంగా తూర్పుదిక్కు తెల్లవార సాగింది. కొంతసేపటికి బంగారు నీలి రంగుతో సూర్యకాంతి ఆ ప్రాంతానికి వింతశోభను సమకూర్చింది.

''ఇంతటి సుందరమైన ఉదయాన్ని నా జీవితంలో నేనెన్నడూ చూడలేదు. ఇప్పుడు నేనెక్కడున్నానో కూడా నాకు బోధపడడం లేదు,'' అన్నాడు వినోదుడు అమితాశ్చర్యంతో.

''భౌతిక ప్రపంచానికి దాపులనే ఉన్నావు. అయితే ఇది భౌతిక ప్రపంచంలో భాగం కాదు. ఇక్కడి సూర్యుడు మీ భౌతిక ప్రపంచంలో లాగా కేవలం వెలుతురూ, వేడీ మాత్రమే కాకుండా సర్వస్వాన్ని ప్రసాదిస్తాడు. చిత్తశుద్ధి కలిగివుంటేచాలు; సూర్యుడు నిన్ను జ్ఞానసంపన్నుడిగా చేయగలడు,'' అన్నాడు వృద్ధపూజారి.

మనోజ్ దాస్



''ఆశ్చర్యపడకు నాయనా! నీ ప్రార్థనలే పుష్పాలుగా మారి దేవత పాదాలపై బడ్డాయి. అసలు పువ్వులెలా పూస్తాయను కున్నావు? అందం కోసం, స్వచ్ఛతకోసం, శాంతికోసం ప్రకృతిపడే తపనే పువ్వులుగా వికసిస్తున్నాయి. వాటి నుంచి ప్రేరణ, ఉత్తేజం పొందగలరనే భూప్రపంచంలో పువ్వులు పూస్తున్నాయి. మంచి కోసం, మాధుర్యం కోసం ఎవరైనా ప్రార్థించినట్ట యితే, ఈ లోకంలో శూన్యంలోనుంచి పుష్పాలు పుట్టుకొస్తాయి!'' అని వివరిం చాడు వృద్ధపూజారి.

వినోదుడు మౌనంగా భక్తితో చేతులు జోడించాడు.

''ఇక్కడ చాలాసేపు వుండడం సాధ్య పడదు. త్వరగా దేవతను కోరవలసిన మూడు వరాలూ కోరుకో,'' అన్నాడు పూజారి.

వినోదుడు దేవతావిగ్రహానికి భక్తితో నమస్కరిస్తూ, ''బంగారులోయ రాజ్యంలో శిథిలాల మధ్య వున్న బంగారువిగ్రహానికి ప్రాణం ప్రసాదించు తల్లీ,'' అని ప్రార్థిం చాడు.

వెంటనే తామరపువ్వొకటి దేవతపీఠం మీద పడింది.

"నీ ప్రార్థన ఫలించింది. నీ వేలికి వున్న ఉంగరాన్ని తీసి, ఆ బంగారు విగ్రహం

''మీరు సామాన్య పూజారులు కారు: పరమ యోగీశ్వరులు!'' అన్నాడు వినో దుడు.

వృద్ధపూజారి చిన్నగా నవ్వి, వినోదుణ్ణి ఆలయం లోపలికి తీసుకుపోయాడు.

దివ్యసుందరరూపంతో వెలుగొందే ఆ దేవతవిగ్రహాన్ని చూడడంతో వినోదుడి కళ్ళనుంచి ఆనందబాష్పాలు రాలాయి. అతడు విగ్రహానికి సాష్టాంగనమస్కారం చేసి, మనసారప్రార్థించి, మెల్లగా తల పైకెత్తి విగ్రహం కేసి చూశాడు. విగ్రహం పాదాల ముందు గుప్పెడు పుష్పాలు ఉన్నాయి. అతడు నమస్కరించడానికి ముందు అవి అక్కడ లేవు!

పేలికి వెయ్యి. ప్రాణం వస్తుంది," అన్నాడు పూజారి.

ప్రాణాలు వచ్చిన ఆ స్త్రీని పెళ్ళాడాలన్న కోరికను రెండవ వరంగా కోరాలన్న ఆశ వినోదుడి మనసులో మెదిలింది. అయినా, ఆ ఆశను కాస్త పక్కకు నెట్టాడు. నవ్వలేని జ్ఞానభూమి యువరాజు అతనికి జ్ఞాపకం వచ్చాడు.

"మహామృగభూమి వాసులు హాయిగా నవ్వేవరం ప్రసాదించుతల్లీ," అన్నాడు వినోదుడు.

దేవతావిగ్రహం చేతినుంచి మరొక తామరపుష్పం పీఠం మీద పడింది.

"ఆ వరమూ సిద్ధించింది," అన్నాడు పూజారి.

వినోదుడు, "సంతృప్తశాంతభూమి వాసులకు పాడగలశక్తి ప్రసాదించు తల్లీ," అన్నాడు భక్తితో.

మూడవ తామరపుష్పం దేవత చేతి నుంచి జారిందేగాని, పీఠాన్ని చేరలేదు. మధ్యలోనే తగులుకుని అలాగే వుండిపోయింది.

"సంతృప్తశాంతభూమి వాసులు పాడడం నేర్చుకోనవసరం లేదు. పైగా, నీకు తారసపడిన యువరాణి తప్ప మరెవ్వరూ పాడాలని కోరడం కూడా లేదు. అందువల్ల ఆమె మాత్రం పాడడం నేర్చుకుంటుంది," అని, పుష్పం మధ్యలోనే ఆగిపోయిన విషయం గురించి వినోదుడికి వివరించాడు పూజారి.





వినోదుడు మౌనంగా తలాడించాడు. ఇంకొకవరం కోరే అవకాశం లేకుండా పోయిందే అన్న బాధ అతన్ని వేధించ సాగింది. అయినా, ఇంకొక వరం కోరితే మాత్రం తప్పేమిటి? అన్న ఆలోచన అతనిలో కలిగింది. మరుక్షణమే ఒక వింతధ్వని వినిపించింది. తిరిగి చూశాడు. ఏదీ స్పష్టంగా కనిపించడం లేదు. చుట్టుపక్కలన్నీ గిర్రున తిరుగు తున్నట్టనిపించింది. కొండలూ, కోనలూ, నదులూ, తటాకాలూ, ఉద్యానవనాలూ, భవనాలూ అన్నీ అగాథంలో కూలి పోతున్నట్టనిపించింది. అయినా ఒక్క దృశ్యం కూడా స్పష్టంగా కనిపించడం లేదు. వినోదుడు స్పృహకోల్పోయి, అక్కడే పడిపోయాడు.

కొంతసేపటికి స్పృహ వచ్చి కళ్ళు తెరిచి చూస్తే, వినోదుడు నీలపర్వతం మీది వింతమొక్క దగ్గర ఉన్నాడు. ఎదురుగా యువరాణి నవ్వుతూ కూర్చుని వున్నది!

"నువ్వు పాడే వరం తెచ్చాను యువ రాణీ!" అన్నాడు వినోదుడు ఉత్సాహంగా.

"ఆ విషయం నాకూ తెలుసు. నీ యాత్రలో విజయం సాధించబట్టే నువ్వు మళ్ళీ ఇక్కడికి సురక్షితంగా చేరుకోగలి గావు!" అన్నది యువరాణి.

"సరే, మనం ఇప్పుడొక పాట పాడు దామా?" అని అడిగాడు వినోదుడు.

"నేర్పితే పాడుతాను," అన్నది యువ రాణి ఉత్సాహంగా.

వినోదుడు మెల్లగా పాడడం ప్రారంభిం చాడు. యువరాణి అతన్ని అనుసరించి పాడసాగింది. మొదట కాస్త తడబడి నప్పటికీ కొంతసేపటికి ఆమె చక్కగా పాడసాగింది. అయితే, అలా పాడుతున్న కొద్దీ, ఆమె తన నుంచి దూరంగా వెళుతూ వుండడం గమనించి వినోదుడు కంగారుపడ్డాడు. కొంతసేపటికి ఆమె పాడుతూ పాడుతూ మేఘంలా ఆవిరిగా మారి, అతని కళ్ళెదుటే మాయమై పోయింది!

''యువరాణీ! యువరాణీ!'' అని అరుస్తూ, పిచ్చివాడిలా అటూ ఇటూ పరిగెత్తాడు వినోదుడు. తిరిగి తిరిగి ఆఖరికి ఒకచోట సొమ్మసిల్లి పడిపోయాడు!

''యువరాణి భౌతిక ప్రపంచానికి చెందిన వ్యక్తి కాదన్న విషయం నువ్వు మరిచిపోకూడదు. ఆమె నివసిస్తూన్న ప్రపంచానికి చెందినవాళ్ళు, ఉన్న వాటికే సంతసించి తృప్తిగా జీవిస్తారు. పాటపాడడానికి కోరడం అంటే, ఉన్న దానికన్నా ఎక్కువ ఆశించడం అన్న మాటే కదా! అలా ఆశించడం మానవ స్వభావం. ఆ సంతృప్తభూమిలో నివసించే వాళ్ళలో ఒక్క యువరాణికి మాత్రమే పాడాలనే కోరిక వుండేది. బహుశా మానవ రూపం దాల్చడానికే ఆమె ఆ విచిత్ర ప్రపంచం నుంచి మాయమైపోయి వుంటుంది!''

వినోదుడు కళ్ళు తెరిచేప్పటికి ఈ మాటలు అతనికి వినిపించాయి. మొదట తనకు దారిచూపిన కరుణాస్వరూపుడయిన ముని తన పక్కన కూర్చుని వుండడం చూసి వినోదుడు, ఆయనకు భక్తితో నమస్కరించాడు.

''ఇప్పుడు నేనెక్కడున్నాను?'' అని అడిగాడు వినోదుడు.

''జ్ఞానభూమి సరిహద్దులలో ఉన్నావు. ఇక్కడే కాలయాపన చేయకూడదు. నువ్వు సంపాదించిన వరం జ్ఞానభూమి ప్రజలకు నవ్వేశక్తిని ప్రసాదించిందన్న





తృప్తితో నువ్వు బంగారులోయకు బయలు దేరాలి," అన్నాడు ముని.

"ఎలా వెళ్ళడం? నేనామార్గం మరిచిపోయానే!" అన్నాడు వినోదుడు.

ముని చిన్నగా నవ్వి, "ఒకచోట అదృశ్యమై, మరొకచోట ప్రత్యక్షమయ్యే రహస్యం నీకు తెలుసునన్న విషయం కూడా నువ్వు మరచిపోయావు! ఆ విద్య ఇప్పుడు నీకు ఉపయోగపడుతుంది. దాని సాయంతో నీ స్వస్థలం చేరుకోవచ్చు," అన్నాడు.

తరవాత ముని దారి చూపగా, వినోదుడు ఒక చిన్న కొండను ఎక్కాడు. కొండ కవతల జ్ఞానభూమిరాజ్యం అతని కంట బడింది. రాజప్రాసాదం కొండకు సమీపం లోనే ఉన్నది. కొందరు రాజభటులు వినోదుణ్ణి చూసి, పోల్చుకుని పరిగెత్తి పోయి అతని రాకను రాజుకు తెలియజేశారు.

కొంతసేపటికి రాజూ, యువరాజూ, మంత్రి, ముఖ్య రాజోద్యోగులూ రాజభవనం ఉపరితలం మీదికి వచ్చి, ఉత్సాహంగా చేతులు ఊపుతూ, వినోదుడికి స్వాగతం పలికారు. ఇంతలో మరికొందరు రాజభవనానికి వెలుపలచేరి ఉత్సాహంగా చేతులు ఊపసాగారు.

అందరూ పరమానందంతో నవ్వుతున్నారు!

వాళ్ళను చూడగానే వినోదుడు కూడా చాలా సంతోషించాడు. కొంతసేపు వాళ్ళతో గడిపితే బావుంటుందనిపించిందతనికి. అయితే, దూరాన్నుంచి ముని, "కాలాతీతమవుతున్నది. త్వరగా బంగారులోయ చేరుకో," అని ఆదేశించడంవల్ల, వినోదుడు మునికి నమస్కరించి, ఆయన వద్ద సెలవు తీసుకుని, బంగారులోయ చేరుకోవాలని కోరుకుంటూ అక్కడే శక్తితరంగాలుగా మారి, క్షణాలలో మాయమైపోయాడు!

కొంతసేపటికి అతడు బంగారులోయ కొండలలో ప్రత్యక్షమయ్యాడు. నిండు

పున్నమి వెన్నెలలో వింత జలపాతం మరింత శోభతో ప్రవహిస్తున్నది. అతని తల మీదుగా కోయిల కూస్తూ ఎగిరింది. ఆ కోయిలకూతకు అతని శరీరం జలదరించింది. వినోదుడు శిథిలాలమధ్య వున్న బంగారువిగ్రహాన్ని సమీపించాడు.

తన వేలి ఉంగరం తీసి విగ్రహం వేలికి వేయగానే, ఆ విగ్రహానికి ప్రాణం వస్తుంది. ఆ తరవాత జరిగే దేమిటి? తను ఆమెను పెళ్ళాడాలని దేవత నుంచి వరం కోరలేదు. కనుక ఆమెను పెళ్ళాడడం సాధ్యం కాదు. మరి, దురాశాపరుడైన రాజు బారినుంచి ఆమె ఎలా తప్పించుకోగలదు? ఇలా కొంతసేపు ఆలోచించి—ముందుగా, విగ్రహాన్ని ప్రాణంతో చూద్దాం. ఆ తరవాత జరిగేది జరగనీ—అనుకుని వినోదుడు తన వేలి ఉంగరం తీసి ఆ విగ్రహం చేతివేలికి పెట్టాడు.

ఆ క్షణమే మెరుపు మెరిసినట్టయింది. అపురూప సౌందర్యంతో వెలిగిపోతూ, ఒక స్త్రీ, పీఠం మీది నుంచి ఒయ్యారంగా కిందికి దిగి అప్సరసలా నవ్వుతూ, వినోదుడి పక్కకు వచ్చి నిలబడి, ''ఇప్పుడు మన వివాహం పూర్తయిందన్నమాట!'' అన్నది.

ఆమె కంఠస్వరమూ, నవ్వూ వినోదుడికి చిరపరిచితంగా ఉన్నట్టే అనిపించింది. అయినా ఆ కంఠస్వరం ఎక్కడ విన్నాడో, నవ్వును ఎక్కడ చూశాడో వెంటనే పోల్చుకోలేక పోయాడు.

"మనకు వివాహమయిందా!'' అన్నాడు వినోదుడు ఆశ్చర్యంగా.

''నువ్వు వింతజలపాతం దాటి వెళ్ళే ముందు, నా వేలి ఉంగరం, నీ వేలికి చేరింది; ఇప్పుడు నువ్వు తిరిగి వచ్చాక, నీ చేతి ఉంగరం తీసి నాకు వేశావు. మరి మన పెళ్ళితంతు పూర్తయినట్టే కదా?'' అన్నదామె నవ్వుతూ.

తను దేవతను కోరనివరం ఇలా సిద్ధించినందుకు వినోదుడు ఎంతగానో పొంగిపోయాడు. —(ముగింపు వచ్చేసంచికలో)






# మహార్ణరాకుమారికథ

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, పూనినకార్యం సాధించి తీరాలనే నీ పట్టుదల ప్రశంసింపదగిందే. అయితే, ఇది నీ స్వకార్యమా లేక పరులెవరైనా తమ స్వార్థంకొద్దీ, నిన్ను పురిగొల్పారా, అన్న అనుమానం కలుగుతున్నది. పరులను గుడ్డిగా నమ్మడంవల్ల కీడే తప్ప, మేలు జరగదు. కాని, ఒక్కొక్కసారి పరిస్థితుల ప్రభావంవల్ల, మేలు కూడా జరగవచ్చు. ఏది ఏమైనా, నువ్వు తగుజాగ్రత్తలో వుండేందుకుగాను, మహార్ణ రాకుమారి కౌసల్య కథ చెబుతాను, శ్రమ తెలియకుండా, విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

## బేతాళ కథలు



మహర్ణదేశాన్ని కువలయాశ్వుడనే రాజు పరిపాలిస్తూండేవాడు. ఆయన బహు శాంతస్వరూపుడూ, ధర్మాధర్మవిచక్షణ తెలిసినవాడూనూ. ఆయన పట్టపురాణి సునందిని బహుగర్విష్ఠి, అహంకారి.

ఆ దంపతులకు, కౌసల్య అనే కుమార్తె ఒక్కతే సంతానం. కౌసల్య పెద్ద అందగత్తెకాదు. కాని, తండ్రి నుంచి పుణికి పుచ్చుకున్న శాంతస్వభావంవల్లా, గుణశీలాలవల్లా, తెలివితేటలవల్లా, అందరిచేతా కొనియాడబడుతూండేది.

కౌసల్య యుక్తవయస్కురాలయేసరికి, కువలయాశ్వుడు, ఆమెకు తగిన వరుడి కోసం స్వయంవరం ప్రకటించే ప్రయత్నంలో వున్నాడు. అలాంటి సమయంలో మంత్రికుమారుడైన సుందరేశ్వరుడికి, కౌసల్యను వివాహమాడాలన్న కోరిక కలిగింది. అతడు అందగాడేగాక, సునిశిత మేధాశాలి.

ఒకనాడు కౌసల్య, చెలికత్తెలతో వనవిహారం చేస్తూండగా, సుందరేశ్వరుడు అక్కడికి వెళ్ళాడు. కౌసల్య అతణ్ణి ఆదరంగా పలకరించింది.

సుందరేశ్వరుడు, ఆమెతో, "నేను మీతో కొన్ని విషయాలు మాట్లాడాలని వచ్చాను, రాకుమారీ!" అన్నాడు.

కౌసల్యకు ఆశ్చర్యం కలిగినా, దాన్ని బయటపడనీయకుండా చెలికత్తెలను దూరంగా వెళ్ళమన్నది. తర్వాత కౌసల్యా, సుందరేశ్వరు లిద్దరూ, ఒక లతామంటపంలో కూర్చున్నారు.

"మహారాజుగారు, మీకోసం స్వయంవరం ప్రకటించాలనుకుంటున్నారు. నాకు బాల్యం నుంచీ మీతో స్నేహం వున్నది. ఆ స్నేహాన్ని ఇంకా పటిష్ఠమైన బంధంగా చేసుకోవాలన్నది, నా కోరిక. ముందుగా మీ అంగీకారమో, తిరస్కారమో తెలుసుకోవాలని వచ్చాను, రాకుమారీ!" అన్నాడు సుందరేశ్వరుడు మృదువుగా.

అతడి మాటలు విన్న కౌసల్యా కొద్దిసేపు తల వంచుకుని వుండిపోయి,

తర్వాత నెమ్మదిగా తల ఎత్తుతూ, "మీరు కోరినదానికి, నా అంగీకారమో, తిరస్కారమో తెలియజేయబోయేముందు, మీకు కొన్ని విషయాలు చెప్పవలసి వున్నది." అన్నది.

"ఏమిటవి?" అని అడిగాడు సుందరేశ్వరుడు ఆశ్చర్యంగా.

"వివరంగా చెబుతాను, వినండి!" అంటూ కౌసల్య ఇలా చెప్పసాగింది:

చాలాకాలం క్రితం, మహర్ణదేశాన్ని కువలయాశ్వుడి తండ్రి, గోవిందమిశ్రుడు పరిపాలిస్తూండేవాడు. ఆయనకు చందన దేశపు రాజైన లక్ష్మణవర్మ బాల్యస్నేహితుడు. కువలయాశ్వుడు యుక్తవయస్కుడవగానే లక్ష్మణవర్మ, తన కుమార్తె సునందినిని, అతడికి చేసుకోవలసిందిగా కోరుతూ, సునందిని చిత్రపటాన్ని పంపించాడు. ఆమె అపురూపసౌందర్యవతి. గోవిందమిశ్రుడు, సునందినిని తన కోడలిగా చేసుకోవాలని ఉబలాటపడ్డాడు. కువలయాశ్వుడు తన అంగీకారాన్ని తెలిపాడు. వివాహమైన తర్వాత, సునందిని సౌందర్యమంతా మేడిపండు చందమనీ, మానసికంగా ఆమె అత్యంత కురూపి అనీ, తండ్రీకొడుకు లిద్దరూ గ్రహించారు. కాని, చేసేదేంలేక నిస్సహాయులుగా వూరుకున్నారు.



ఇలా వుండగా, ఒకనాడు కువలయాశ్వుడు వేటకు వెళ్ళి, సింహాన్నొక దాన్ని వెంటాడుతూ, పరివారం నుంచి వేరుపడ్డాడు. చివరకు ఒకచోట ఆయన సింహాన్ని బాణంతో కొట్టాడు. దెబ్బతిన్న సింహం రెచ్చిపోయి, కువలయాశ్వుడి గుర్రం మీదికి దూకి, ఒక్కపంజాదెబ్బతో గుర్రాన్ని చంపేసింది. కువలయాశ్వుడు ఒర నుంచి కత్తి దూసి సింహంతో తలపడ్డాడు. ఆయన సింహాన్ని చంపగలిగాడు కాని, దాని పంజావిసుర్లకు గాయపడ్డాడు.

ఆయన అక్కడి నుంచి కొంతదూరం నడిచి, ఒకచోట స్పృహ తప్పి పడిపోయాడు. దాపుల పరాంకుశుడు అనే



ముని ఆశ్రమం నిర్మించుకుని తపస్సు చేసుకుంటున్నాడు. ఆయన కుమార్తె రేవతి, ఆశ్రమప్రాంగణమంతా శుభ్రం చేస్తూ, కువలయాశ్వుడు పడిపోయిన సవ్వడి విని, వచ్చి చూసింది. ఆ సమయంలో పరాంకుశుడు పూజలో వున్నాడు.

రేవతి చప్పున ఆశ్రమంలోకి వెళ్ళి, ఒక మట్టిపాత్ర నిండా చల్లని నీరు తెచ్చి, కువలయాశ్వుడి ముఖం మీద చిలకరించింది. వెంటనే ఆయన కళ్ళు తెరిచాడు. రేవతి, కువలయాశ్వుడికి సాయం చేసి ఆశ్రమం లోపలికి తీసుకువెళ్ళింది.

తర్వాత రేవతి, కువలయాశ్వుడి గాయాలను తడిగుడ్డతో శుభ్రంగా తుడిచి, వాటికి ఏదో ఆకుపసరు పూసింది. వేడి వేడి పాలు తీసుకువచ్చి, ఆయన చేత తాగించింది.

రేవతి ప్రశాంత సౌందర్యానికీ, ఆమె ఆదరపూర్వకమైన ప్రవర్తనకూ కువలయాశ్వుడి మనసు కరిగిపోయింది. కొద్దిసేపటికి పరాంకుశముని వచ్చి, ఆయన్ని పరామర్శించి, వివరాలన్నీ అడిగి తెలుసుకున్నాడు.

ఆ రాత్రి అక్కడే గడిపాడు, కువలయాశ్వుడు. మర్నాటి ఉదయానికి కొంచెం కోలుకున్న కువలయాశ్వుడు, పరాంకుశమునికి తన కృతజ్ఞతలు తెలియజేసి, రేవతిని వివాహమాడాలన్న కోరికను వెల్లడించాడు. అందుకు ముని సంతోషంగా అంగీకరించాడు. కువలయాశ్వుడు, రేవతిని గాంధర్వవివాహం చేసుకున్నాడు.

ఆ మధ్యాహ్నానికి, కువలయాశ్వుడి పరివారం, ఆయన్ని వెతుకుతూ అక్కడికి వచ్చింది. రేవతిని వెంటబెట్టుకుని, ఆయన నగరం చేరాడు.

చిన్నకోడలి వినయవిధేయతలు చూసి గోవిందమిశ్రుడు పరమానంద భరితుడైతే, తనకు సవతి వచ్చిందన్న ఈర్ష్యతో కుంగిపోయింది, సునందిని.

కొంతకాలం గడిచింది. సునందిని గర్భవతి అయింది. అదే సమయంలో



రేవతి కూడా గర్భవతి అని విని, ఆమె ఈర్ష్యతో జ్వలించిపోయింది. సునందిని చెన్నమ్మ అనే ఒక దాసితో, ఎలాగైనా సరే రేవతి గర్భం పోయేలా, ఏదైనా ఉపాయం ఆలోచించమన్నది.

వృద్ధురాలైన ఆ దాసీది, సునందిని మాటలకు నిర్విణ్ణురాలై, అంతలోనే తెప్పరిల్లి, "మొగ్గగా వుండగానే తుంచి పారేస్తే గొప్పేముందమ్మా! పువ్వు పుట్ట నివ్వండి. కొమ్మనుంచి తెంపి బురదలో పారేద్దాం," అని తన చాకచక్యాన్నంతా ఉపయోగించి, సునందనిని ఒప్పించింది.

తర్వాత రేవతి అంతఃపురానికి వెళ్ళి, అక్కడ రేవతికి దాసీగా వున్న తన కూతురు మాలినికి విషయమంతా చెప్పి, రేవతిని కంటికి రెప్పలా కాపాడుకోమని హెచ్చరించింది. నెలలునిండి రేవతి, సునందిని ప్రసవించే రోజులు దగ్గిరపడసాగాయి.

ఒకనాడు రేవతికి, సునందినికి ఒక్కసారే నొప్పులు ప్రారంభమయాయి. తన పథకానికి అనువుగా, ఇద్దరూ దరిదాపుల్లో వుంటే బావుంటుందన్న సాకుతో, రేవతిని, సునందిని పక్కగదిలోకి చేర్పించింది, చెన్నమ్మ.

కొద్దిక్షణాలతేడాలో రేవతీ, సునందినిలు ఆడపిల్లలను ప్రసవించారు. బిడ్డ పుట్టిన కొద్ది నిముషాల్లోనే వాతంకమ్మి రేవతి మరణించింది. చెన్నమ్మ తల మీద పిడుగుపడినట్టయింది. కాని, ఆమె అంతలోనే తేరుకుని పాతగుడ్డలమాటున అతి చాకచక్యంగా రేవతి బిడ్డను సునందిని పక్కలోకీ, సునందిని బిడ్డను రేవతి పక్కలోకీ మార్చేసింది.

కువలయాశ్వుడు వచ్చేసరికి, బిడ్డల మార్పిడి జరిగిపోయింది.

స్పృహవచ్చాక రేవతి మరణం విని, సునందిని చాలా సంతోషించింది. ఆమె రహస్యంగా చెన్నమ్మతో, "పెద్ద ప్రాణాన్ని దేవుడే లాక్కుపోయాడు. ఇంక, ఆ పసిదాన్ని మాయం చేయవలసిన భారం నీదే!" అన్నది.




"అలాగే, అమ్మా!" అని వృద్ధదాసీ, రేవతి పక్కలోకి మార్చిన సునందిని బిడ్డను తీసుకునివెళ్ళి, పిల్లలు లేని ఒక కుమ్మరి ఇంటిముందు పడుకోబెట్టి వచ్చింది —అని చెప్పి కౌసల్య, సుందరేశ్వరుడి ముఖంలోకి చూసి నవ్వింది.

"ఆ విధంగా, సునందిని పక్కలో చేరిన, రేవతి బిడ్డను నేను. రాణీ సునందిని కుమార్తె—నా అక్క అయిన అమ్మాయి కుమ్మరి గురవయ్య కూతురుగా పెరుగుతున్నది. ఈ రహస్యం వృద్ధదాసీ కూతురు మాలిని, నా దగ్గిర నోరుజారి చెప్పేసింది. నేను యిప్పుడు యిదంతా మీకు ఎందుకు చెప్పానంటే, సాధ్యమైనంత త్వరలో, సునందినీదేవికి అసలు విషయం చెప్పదలచుకున్నాను. అప్పుడు నన్ను పెళ్లాడే వ్యక్తికి నా ద్వారా రాజ్యం లభించదు," అంటూ ముగించింది, కౌసల్య.

ఆశ్చర్యంగా అంతా వింటున్న సుందరేశ్వరుడి ముఖంలో, వచ్చినప్పటికంటె మరింత ఎక్కువగా సంతోష ఛాయలు కదిలినై. అతడు లేచి, "మీ మాటల్లోని అంతరార్థం, నాకు అర్థమైంది! వస్తాను, కౌసల్యా," అని వెళ్ళిపోయాడు.

ఆ మరుసటి రోజు మధ్యాహ్నం. కాషాయ వస్త్రాలూ, మెడలో రుద్రాక్ష మాలలూ, బారెడు గడ్డంతో వున్న సాధు వొకడు, సునందిని వుండే భవనపు తల వాకిలి దగ్గిర నిలబడి, "జై, పరమేశ్వరా! అమ్మా సునందినీదేవీ, త్రికాలాలు చెప్పగల దిట్టను. నీ భవిష్యత్తు చెప్పడానికి వచ్చాను, తల్లీ!" అంటూ కేక పెట్టాడు.

సునందిని చెలికత్తెలు, ఆ కేక విని వెళ్ళి, సునందినితో చెప్పారు. ఆమె సాధువును తీసుకురమ్మన్నది. అతడు సునందినిని సమీపిస్తూనే చేయెత్తి, మరొక సారి, "జై, పరమేశ్వరా!" అని, సునందినితో, "నీకు ఒక్కతే కుమార్తె, అవునా?" అన్నాడు.

ఆ మాటలకు సునందిని హేళనగా నవ్వి, "దారిన పోయేవాణ్ణి ఎవడినడిగినా,

ఆ సంగతి చెబుతాడు. దానికి నీ జోస్యం కావలసి వచ్చిందా ?'' అన్నది.

సాధువు గంభీరంగా ముఖం పెట్టి, ''నేను చెప్పబోయేది అది కాదు, తల్లీ! ఏదీ నీ కుమార్తెను, ఒక్కసారి పిలిపించు,'' అన్నాడు.

సునందిని, కౌసల్యను రావలసిందిగా కబురు పంపింది. కౌసల్య రెండు నిమిషాల్లో అక్కడికి వచ్చింది. సాధువు కౌసల్యను చూస్తూనే, ''ఈ పిల్ల, నీ సొంత బిడ్డ కాదు!'' అన్నాడు.



సునందిని అదిరిపడి, ''ఏమిటీ!'' అన్నది బిగ్గరగా.

సాధువు కళ్ళు మూసుకుని తెరిచి, ''ఈ బిడ్డ నీ సవతి కూతురు. నీ బిడ్డ కుమ్మరి గురవయ్య యింట పెరుగుతున్నది,'' అంటూ, అతడి వివరాలు చెప్పాడు.

సునందిని వెంటనే, కుమ్మరి గురవయ్యను భార్యా పిల్లలతో తీసుకురావలసిందిగా, ఒక దాసీకి చెప్పింది. సాధువును పట్టి పట్టి చూసిన కౌసల్య, అతణ్ణి సుందరేశ్వరుడుగా పోల్చుకుని పరమానందభరితురాలైంది.

ఇంతలో కుమ్మరీ, అతడి భార్యా వచ్చారు. వారి వెంట జగన్మోహనమైన సౌందర్యంతో సునందిని పోలికలు గల ఒక అమ్మాయి వున్నది. ఆమెను చూస్తూనే, తన కుమార్తెగా గుర్తించిన సునందిని, ఒక కేక పెట్టి మూర్ఛపోయింది.

పరిచారికలు వెంటనే సునందినికి, శైత్యోపచారాలు చేశారు. స్పృహ రాగానే ఆమె, కౌసల్యనూ, తన కూతుర్నీ దగ్గిరకు తీసుకుని, సాధువుతో, ''మహానుభావా, మీ సహాయానికి చాలా కృతజ్ఞురాలిని!'' అన్నది కళ్ళ నీళ్ళతో.

సాధువు, ''జై పరమేశ్వరా!'' అంటూ వెళ్ళిపోయాడు.

సునందిని, కుమ్మరి దంపతులను గౌరవించి, వాళ్ళకు విలువయిన బహుమానాలిచ్చింది. ఈ జరిగినదంతా కౌసల్య ద్వారా విన్న కువలయాశ్వుడు పరమా

నందభరితుడయ్యాడు. ఆ తర్వాత కౌసల్య కోరిన విధంగా, ఆమెకూ, సుందరేశ్వరుడికీ వివాహం జరిపించాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, అంతా సవ్యంగా జరిగింది కాబట్టి సరి పోయింది. కాని సుందరేశ్వరుడే గనక మరో విధంగా ప్రవర్తించి వుంటే, కౌసల్య చిక్కుల పాలయ్యేది కదా? అంతటి అంతఃపుర రహస్యాన్ని, పరాయి వ్యక్తిని నమ్మి చెప్పడం, అవివేకం కాదా? స్వయంవరం ప్రకటించి, తన కుమార్తెను ఏ రాజకుమారుడితోనో వివాహం చేయ దలచిన కువలయాశ్వుడు, కుమార్తె కోరి నంతనే, మంత్రి కుమారుడితో, ఆమె వివాహానికి అంగీకరించడం వివేకం అని పించుకుంటుందా? ఈ సందేహానికి సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "కౌసల్య ఎవరి కూతురైనదీ, ఏ దాసీ ద్వారానో సునందిని విని వుంటే, కౌసల్య తప్పక చిక్కుల పాలయ్యేది. అలాంటి ప్రమా దాన్ని వారించేందుకే ఆమె, తనను వివాహమాడదలచిన సుందరేశ్వరుడికి, ఆ రహస్యం చెప్పింది. ఈ విధంగా ఆమె సుందరేశ్వరుడి నిజాయితీని, బుద్ధి కుశలతను పరీక్షకు పెట్టడమే గాక, తనను తాను రక్షించుకోగలిగింది. ఇదంతా ఎంతో వివేకంతో కూడిన పని. ఇక, రాజు తన కుమార్తె మంత్రి కుమారుణ్ణి వివాహమాడడానికి ఒప్పుకోవడంలో ఎంతో వివేకాన్నీ, లోకజ్ఞతనూ ప్రదర్శించాడు. కౌసల్య రాజ్యార్హురాలు కాదని తెలిసీ, సుందరేశ్వరుడు సాధువు రూపంలో వెళ్ళి, కౌసల్య చెప్పిన రహస్యాన్ని నలుగురి ముందూ నందినికి చెప్పి, ఆమె ప్రవర్తనలో మార్పు తీసుకు వచ్చాడు. ఇటు వంటి సాహసం ధైర్యశాలీ, ప్రజ్ఞావంతుడూ మాత్రమే చేయగలడు," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగ గానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)



కావ్యకథలు:

# మణిమంజీరం-2



పూంపుహార్ పట్టణానికి చెందిన యువ వర్తకుడు కోవలన్, ఓడల వ్యాపారి కుమార్తె కణ్ణగిని వివాహమాడాడు. ఆ పట్టణంలోనే మాధవి అనే నాట్యకత్తె, నాట్యం నేర్చుకుని—రాజు, పురప్రముఖుల సమక్షంలో తన మొట్టమొదటి నాట్యప్రదర్శన నిచ్చింది.

మాధవి, తన అద్భుతమైన నాట్య ప్రదర్శనతో అందరినీ అలరించింది. నాట్యప్రదర్శన ముగియగానే అందరూ కరతాళధ్వనులతో ఆమె నాట్యప్రతిభను ప్రశంసించారు.





మాధవి నాట్యానికి సంతసించిన రాజు, పచ్చటిఆకులదండా, వెయ్యి బంగారు కాసులూ ఆమెకు బహూకరించాడు. ఆ కానుకకు మాధవి ఎంతగానో సంతోషించింది.



ఆనాటి వృత్తికళాకారిణులయిన నాట్యకత్తెల ఆచారం ప్రకారం— రాజు బహూకరించిన దండను, మాధవి తన చెలికత్తెకు ఇచ్చి, పట్టణంలో నంపన్నులు, సాయంకాలం ఇంటికి తిరిగి వెళ్ళే దారిలో దండతో పాటు ఆమెను నిలబడమన్నది.

వెయ్యి బంగారుకాసులకు ఆ దండను కొనేవారికి మాధవి సొంతమవుతుంది. వాళ్ళకోసమే ఆమె ప్రత్యేకంగా ఆడుతుంది, పాడుతుంది. అదీ ఆనాటి ఆచారం. మాధవి నాట్యం చూసిన కోవలన్, ఆమె చెలికత్తె నుంచి ఆ దండను కొన్నాడు.





కోవలన్, చెలికత్తె వెంట మాధవి ఇల్లు చేరాడు. మాధవిఎంతో గౌరవంగా అతన్ని ఆహ్వానించింది. అద్భుతమైన తన ఆటపాటలతో మురిపించింది. కోవలన్ ఆమె అందచందాలు చూసి మైమరచాడు.

కోవలన్ మొదట నాట్యం కోసమే మాధవి చెంతకు చేరినప్పటికీ, క్రమ క్రమంగా అతడు ఆమెను ప్రేమించ సాగాడు. మాధవి కూడా అతన్ని తన భర్తలాగానే భావించసాగింది. సర్వాన్ని మరచి ఇరువురూ హాయిగా కాలం గడప సాగారు.





ఒకరి సాహచర్యంలో మరొకరు పరవశించిపోతూ, ఇరువురూ కలిసి నగర మంతా తిరుగుతూ, అక్కడి వింతలూ, విశేషాలూ చూడసాగారు. భక్తితో చుట్టి వస్తే—పాముకాటు విషాన్ని, చిత్త భ్రమనూ, దయ్యాలనూ వదలగొట్టే మాయాస్తంభాన్ని వాళ్ళు చూశారు.

ఉద్యానవనంలో ఒక వింత విగ్రహం ఉండేది. తెలిసో, తెలియకో రాజు ధర్మ విరుద్ధంగా నడుచుకున్నట్టయితే ఆ విగ్రహం కళ్ళవెంట నీళ్ళు కారేవి! ఆ కారణంగా ప్రజలే కాకుండా రాజు కూడా తన పాలనలో ధర్మం తప్ప కుండా ఎంతో జాగ్రత్తగా వ్యవహరించే వాడు!





నగరమధ్యంలో ఒక వింత తటాకం వుండేది. ఆ తటాకంలో స్నానం చేస్తే సర్వరోగాలూ నశించేవి. చెవిటివాళ్ళు వినగలిగేవాళ్ళు; మూగవాళ్ళు మాట్లాడ గలిగేవాళ్ళు! ఇటువంటి వింత లెన్నిటినో చూస్తూ మాధవి, కోవలన్‌లు హాయిగా కొంతకాలం గడిపారు. ఆహార విహారాలన్నిటికీ కోవలన్ ధనాన్నంతా ఖర్చు చేశాడు.

గ్రీసు మొదలైన సుదూర ప్రాంతాల నుంచి వచ్చిన ఓడలనుంచి కనిపించే దీపాల కాంతీ, స్థానికుల పడవలలోని దీపాల వెలుతురూ సముద్రజలం మీద వింత అందాలను సమకూర్చేవి. పిల్లగాలులు వీచే భవన ఉపరితలం మీది నుంచి కోవలన్, మాధవి ఆ అందాలను చూస్తూ సాయంకాలాలను గడిపేవాళ్ళు!





వీళ్ళిలా హాయిగా కాలం గడుపుతూ వుంటే, కోవలన్ ఇంటివద్ద కణ్ణగి చెప్ప రాని బాధను మౌనంగా అనుభవించ సాగింది. అయినా, తన భర్త ప్రవర్తన గురించి ఆమె ఎవ్వరికీ చెప్పలేదు. ఉన్న నగలను ఒక్కొక్కటిగా అమ్ము కుంటూ గుట్టుగా కాపురం గడుపు కుంటూ రాసాగింది. —(ఇంకావుంది)



# దయ్యాల ఆట

రామభద్రపురం సంత నుంచి బయలు దేరిన సోమరాజూ, అతని భార్య రామ తిలకం సాయంకాల మయ్యేటప్పటికి, నిండుగా ప్రవహిస్తున్న ఒక ఏటిప్రాంతాన్ని చేరారు.

అప్పటికి ఆకాశమంతా మేఘాలు కమ్మివున్నాయి. ఇంకా ముందుకు వెళ్ళా లంటే, తమ ఊరు కోటవలస రెండు కోసులదూరం వున్నది. ఈలోపల వర్షం తప్పేటట్టులేదు. ఏమి చెయ్యడమా అని ఆలోచిస్తూంటే, వాళ్లకు ఏటివారగా, ఒక పాతబడిన ఇల్లు కనిపించింది.

తమ చేతిసంచులతో భార్యాభర్త లిద్దరూ, ఆ ఇంటికి వెళ్ళారు. శిథిలా వస్థలో వున్న ఆ ఇల్లు, నిర్మానుష్యంగా వున్నది. ఇంతలో టపటపమని చినుకులతో వాన ప్రారంభమైంది. తన చేతిసంచీ లోంచి, తను సంతలో కొన్న కొండచీపురు తీసి, ఆ ఇంటిలోని ఒక గది నేల తుడిచింది రామతిలకం. భార్యాభర్త లిద్దరూ, తమ చేతిసంచులను ఒక గోడ మూల వుంచి, అక్కడే చతికిలబడ్డారు.

బయట ఉరుములతో, మెరుపులతో వర్షం మరింత ఉధృతమైంది. ఇంటి పైన కప్పిన దోనెపెంకులు, అక్కడక్కడ పగిలిపోవడంతో, వానచినుకులు లోపల పడసాగాయి.

సోమరాజు కూర్చున్నచోటు నుంచి లేచి, గది కిటికీ లోంచి బయటకు చూస్తూ, ''బాగా చీకటిపడిపోయింది. వర్షం తగ్గినా, ఈ చీకట్లో దారి వెతుక్కుంటూ నడవడం కష్టం,'' అన్నాడు.

ఒక గంట తర్వాత వాన తగ్గింది. ఇంటిచుట్టూ చేరిన నీటిలోంచి కప్పలు బెకబెకలు ప్రారంభించాయి. దూరంగా నక్కకూతలు, నిర్మానుష్యంగా వున్న ఆ

ఎస్. వి. ఆర్. సత్యనారాయణమూర్తి



ప్రదేశంలో వాళ్ళకు భయం వేయసాగింది.

హఠాత్తుగా వాళ్ళ కళ్ళముందు ఏవో కాంతులు కనిపించాయి. ఆ భార్యాభర్తలు భయంతో కళ్ళు మూసుకుని తెరిచేంతలో, వాళ్ళముందు మూడు దయ్యాలు ప్రత్యక్షమయ్యాయి. వాటిని చూసి, వాళ్ళు భయంతో వణకసాగారు.

అప్పుడు దయ్యాల్లో ఒకటి, "భయపడకండి! మావల్ల, మీకెలాంటి హానీ జరగదు. కాలక్షేపం కోసం, మీతో ఒక ఆట ఆడతాం," అన్నది.

దయ్యాలతో ఆట అనేటప్పటికి, భార్యాభర్తలకు మరింత భయం పట్టుకున్నది.

గది అంతా ఒక వింత కాంతితో వెలిగిపోతున్నది.

ఆ దయ్యం మళ్ళీ సోమరాజుతో, "నువ్వు జాగ్రత్తగా విను! మేం ముగ్గురం అచ్చం నీ పెళ్ళాంలా తయారవుతాం. అప్పుడు, మా నలుగురిలో నీ పెళ్ళాం ఎవరో, మాట్లాడకుండా నువ్వు పోల్చుకోవాలి," అన్నది.

అంతలో గదిలో వెలుగుపోయి, చీకటి ఆక్రమించుకున్నది. తర్వాత కొద్ది క్షణాల్లోనే వెలుతురు వచ్చింది. ఇప్పుడు సోమరాజు ఎదురుగా నలుగురు యువతులు నిలబడి వున్నారు. అందరూ రామతిలకం లాగే కనిపిస్తున్నారు.

సోమరాజు, వాళ్ళ దగ్గరగా వెళ్ళాడు. అందులో ఎవరు తన భార్యో పోల్చడం అతడికి సాధ్యపడలేదు. గుడ్లప్పగించి చూస్తూ నిలబడిపోయాడు.

ఉన్నట్టుండి నలుగురూ నాట్యం చెయ్యడం ప్రారంభించారు. తన భార్యకు నాట్యం చెయ్యడం ఎలా వచ్చింది? అన్న అనుమానం కలిగిన సోమరాజుకు, మరుక్షణంలోనే ఇదంతా దయ్యాలమాయ అని తెలిసిపోయింది.

కొద్దిసేపటి తర్వాత, దయ్యాలు మూడూ తమ, తమ రూపాలు ధరించాయి. "ఏమండీ!" అంటూ రామ

తిలకం, సోమరాజు దగ్గిరకు వచ్చి నిల బడింది.

సోమరాజు, ఆమె కేసి అనుమానంగా చూడసాగాడు. అప్పుడు దయ్యాల్లో ఒకటి పెద్దగా నవ్వి, "భయపడకు. ఆమె నీ పెళ్ళామే!" అన్నది.

ఆ దయ్యమే యీసారి రామతిలకంతో, "అమ్మాయ్, ఇప్పుడు మేము, నీ భర్త రూపం ధరిస్తాం. అతనూ, మేమూ కలిసి వుంటే, నీ భర్త ఎవరో పోల్చుకోవాలి," అన్నది.



రామతిలకానికి ముచ్చెమట్లు పొయ్య సాగాయి. మరొకసారి గది అంతా అంధ కారమయమైంది. కొద్దిక్షణాల్లో వెలుతురు వచ్చింది. రామతిలకం ఎదుట, సోమరాజు రూపంలో నలుగురు నిలబడి వున్నారు.

రామతిలకం, వాళ్ళ కేసి చూస్తూన్నం తలో, ఆమె కొక చక్కని ఆలోచన వచ్చింది. ఆమె వాళ్ళతో, "చూడండి! ఈ మధ్య నా భర్త, నా కొక నగ చేయిం చాడు. అది ఉంగరమా, ముక్కుపుడకా, జూకాలా, గాజులా? మీలో ఎవరు ఏది అనుకుంటే, అది మీ అరచేతి మీద రాసి చూపించండి. నేను వెంటనే నా భర్త ఎవరో చెప్పగలను," అన్నది.

"ఏమమ్మాయ్, నీవు చాలా గడుసు దానిలా వున్నావే! అరచేతిమీదరాసి చూప మంటున్నావు. నీ భర్త అరచేతిలో, ఏదైనా పుట్టుమచ్చ వుండివుంటుంది. అది చూసి, నీ భర్తను పోల్చుకుందామనుకుంటు న్నావు. అవునా?" అని అడిగింది ఒక దయ్యం.

"ఉట్టినే అనుమానపడకు. కావా లంటే మీ నలుగురూ అరచేతులు పరీక్షించుకోండి," అన్నది రామతిలకం ధైర్యంగా.

"అయితే, ఆ నగ ఏదో నీ భర్తకే తెలుస్తుందని ఎత్తుగడవేశావు. నేను ఎలాగూ బయటపడ్డాను గదా! మిగిలిన ముగ్గురిలో, నీ భర్త ఎవరో పోల్చుకో," అన్నది దయ్యం.

ఆ దయ్యమే, మిగిలిన ముగ్గురూ అరచేతులలో రాసుకోవడానికి, అవసరం అయిన ద్రవమూ, కలంపుల్లా ఏర్పాటు చేసింది. సోమరాజులా వున్న మిగిలిన ముగ్గురూ, కలంపుల్లను ద్రవంలో ముంచి ఏదో రాశారు.

మొదట ఒకడు, తన అరచేతిని రామతిలకానికి చూపించాడు. దానిలో ముక్కుపుడక అని రాసి వుంది. రెండవ వాడి అరచేతిలో కూడా ముక్కుపుడక అనే వున్నది. మూడవవాడి అరచేతిలోనూ అదే!

"ఇప్పుడు చెప్పు, నీ భర్త ఎవరో?" అంటూ రాయడానికి ఏర్పాటు చేసిన దయ్యం బిగ్గరగా నవ్వింది.

రామతిలకం చిరునవ్వు నవ్వుతూ, "దయ్యాలలో మీరు మంచివారిలా వున్నారు. అందువల్లనే, మీరు మమ్మల్ని అల్లరి పెట్టకుండా, సరదాగా ఆటలతో ఆటపట్టిద్దామనుకుంటున్నారు. మీ మాయ చేత, నా భర్త మనస్సు వశం చేసుకుని, అందరూ ముక్కుపుడక అని రాసేటట్టు చేశారు. కాని, ఒక విషయం మీరు గమనించలేకపోయారు," అన్నది.

"ఏమిటా విషయం?" అని అడిగింది దయ్యం.

"నా భర్త ఏదైనా రాసేముందు, దేవుడి పేరు మీద ఒక చుక్క పెట్టి, తరవాత రాస్తాడు. అది ఆయన అలవాటు. మీ వశీకరణం, ఆ దేవుడి విషయంలో పని చెయ్యలేకపోయింది. అరచేతిలో చుక్క వున్న ఆయనే, నా భర్త!" అంటూ తన భర్తను చూపించింది రామతిలకం.

"ఆఁ, అరచేతిలో దేవుడా? అమ్మో! దేవుడి ముందు మా ఆటలు సాగవు," అంటూ దయ్యాలు మాయమైపోయాయి.

తన భార్య తెలివితేటలవల్ల, దయ్యాల పీడవిరగడయినందుకు, ఆమెను మెచ్చుకున్నాడు సోమరాజు. వాళ్లు, ఆ రాత్రికి అక్కడే వుండి, తెల్లవారుతూండగా తమ ఊరివైపుకు ప్రయాణం సాగించారు.





# కృష్ణావతారం

కరవీరపురం చేరుతూనే కృష్ణుడు అక్కడి కావలివాళ్ళతో తాను ఫలానా అనీ, సృగాల వాసుదేవుడితో యుద్ధానికి తామంతా వచ్చామనీ, వెంటనే ఆ సృగాలవాసుదేవుడు వచ్చి యుద్ధం చెయ్యవలిసిందనీ చెప్పి కబురు చేశాడు. వాళ్ళు వెళ్ళి తమ రాజుకు యీ వార్త చెప్పారు.

ఆ మాట వింటూనే సృగాలవాసుదేవుడు కోపంతో కళ్ళెర్రచేసి, పూర్వం సూర్యుడు తనను మెచ్చి ఇచ్చిన బంగారు రథం ఎక్కి, బంగారు కవచం ధరించి, అమోఘమైన విల్లూ, బాణాలూ, ఖడ్గమూ మొదలైన ఆయుధాలు వెంట తీసుకుని, సైన్యాన్ని వెంట రావద్దని చెప్పి, ఒంటరిగా బయలుదేరి వచ్చాడు.

యమధర్మరాజులాగా వచ్చే సృగాల వాసుదేవుణ్ణి చూసి బలరామకృష్ణులు సంభ్రమం చెందారు. దమఘోషుడు వారిద్దరికీ ఉత్సాహం కలిగించాడు. తరవాత కృష్ణుడు తన రథాన్ని శత్రురథానికి ఎదురుగా నడిపించుకుంటూ వెళ్ళాడు. ఆ మీద ఇద్దరికీ భయంకరమైన ద్వంద్వ యుద్ధం జరిగింది.

ఒకరిపైన ఒకరు బాణవర్షం కురిపించారు. ఒకరు వేసిన అస్త్రాలను ఒకరు ఛేదించారు. కృష్ణుడు తన విరోధి విల్లు విరగగొట్టి, సారథిని చంపాడు. సృగాల వాసుదేవుడు లక్ష్యపెట్టక, మరొక విల్లు తీసుకుని రథాన్ని తానే నడుపుకుంటూ కృష్ణుడితో, ''గోమంతం దగ్గిర కొందరు

14. సృగాలవాసుదేవుడి వధ




రాజులను జయించి, ఆ గర్వంతో ఇక్కడికి వచ్చావు. ఆ రాజులు మూఢులు, అల్పులు. నేను ఒంటరిగా వచ్చాను. నువు కూడా ఒంటరిగానే నాతో యుద్ధానికి వచ్చావు. ఇది ధర్మయుద్ధం. ఈ ప్రపంచంలో ఇద్దరు వాసుదేవు లుండటానికి వీల్లేదు. అందుచేత నిన్ను చంపి, నేనొక్కణ్ణే వాసుదేవు డనిపించుకుంటాను," అన్నాడు.

కృష్ణుడు వెటకారంతో, "నీలో ఇంకా యుద్ధవాంఛ ఉన్నట్టయితే నీ ప్రతాపం చూపించు, చూస్తాను. తరవాత నేను చేసేదేదో చేస్తాను. దాన్ని గురించి ఇప్పుడు చెప్పవలిసిన పనిలేదు," అన్నాడు.

సృగాలవాసుదేవుడు అతి వేగంగా కృష్ణుడిపై బాణాలూ, తోమరాలూ, చక్రాలూ, గొడ్డళ్ళూ, పరిఘలూ, ఖడ్గాలూ విసిరి, చీకటి కమ్మేలాగా చేశాడు.

కృష్ణు డది చూసి, "నీ శక్తి చూపావు, చూశాను. ఇదుగో నేను చెయ్యబోతున్నది," అంటూ తన చక్రాయుధాన్ని అతడి మీద ప్రయోగించాడు. అది మహా భయంకరంగా మెరుగుతూ మెరుపులా వెళ్ళి, సృగాలవాసుదేవుడి తలను రెండుగా నరికి, కృష్ణుడి చేతికి తిరిగి వచ్చింది.

ఈ విధంగా సృగాలవాసుదేవుడు యుద్ధంలో చనిపోయాడని విని, అంతఃపుర కాంతలు గొల్లున ఏడుస్తూ తమ భర్త పడిపోయిన చోటికి వచ్చారు. పట్టపురాణి తన కొడుకైన శక్రదేవుణ్ణి తెచ్చి, కృష్ణుడి పాదాల మీద పడేసి, ఏడ్చింది. కృష్ణు డామె నోదార్చి, మంత్రులనూ సామంతులనూ, పౌరముఖ్యులనూ, పురోహితులనూ పిలిపించి, శక్రదేవుడికి రాజ్యాభిషేకం చేయించాడు.

తరవాత కృష్ణుడు మధురకు తిరిగి పోతాడని తెలిసి అతని మేనమామ అయిన దమఘోషుడు, వెళ్ళివస్తానని చెప్పి, తన సైన్యంతో సహా చేదిదేశానికి వెళ్ళిపోయాడు.

బలరామకృష్ణులు అయిదు రోజులు ప్రయాణించి ఆరో నాటికి మధురా

నగరాన్ని చేరవచ్చారు. నగరం అంత దూరాన కనబడగానే కృష్ణుడు పాంచ జన్యం పూరించాడు. ఆ శంఖనాదం విని యాదవులు, ఉగ్రసేనుణ్ణీ, ప్రధాన పురోహితులనూ వెంటబెట్టుకుని, ఏనుగులనూ, గుర్రాలనూ, సైనికులనూ ఆయత్త పరిచి. గొడుగులు తీసుకుని, మంగళ వాద్యాలతో సహా ఎదురు వచ్చారు. వంది మాగధుల స్తోత్రాలూ, బ్రాహ్మణుల ఆశీర్వాదాలూ మారుమోగుతూండగా బలరామకృష్ణులు మహావైభవంగా మధురా ప్రవేశం చేశారు.

కృష్ణబలరాముల చేత ఓడిపోయి మగధకు తిరిగి పోయిన జరాసంధుడు అవమానంతో కుమిలిపోతున్నాడు. అంత మంది రాజులనూ, అంత సేననూ వెంట బెట్టుకుని పోయి, ఇద్దరు యాదవకుమారుల చేతిలో ఓడి పారిపోవటం కన్న సిగ్గుబాటు ఇంకేముంటుంది ? ఈ అవమానంతో అతనికి మనశ్శాంతి లేకుండా పోయింది.

చివరకు జరాసంధుడు రాజుల నందరినీ తిరిగి సమావేశపరిచి, "పాపిష్ఠి దేవుడు అనుకూలించకపోయేసరికి మనం, ఇంత బలపరాక్రమాలుండి కూడా ఇద్దరు గోపబాలకుల చేతిలో దెబ్బ తిన్నాం. మనకు కలిగిన ఈ అపఖ్యాతి శాశ్వతంగా ఉండిపోతుంది. అలా కాకుండా చెయ్యాలంటే మనం ఆ యాదవు లిద్దరినీ ఎలాగైనా చంపటం తప్ప మరొక మార్గం లేదు.





మీ రందరూ మీమీ సైన్యాలతో మధుర పైకి బయలుదేరండి. మన బలాలముందు క్షుద్రులైన యాదవులు నిలవటం కల్ల.'' అని చెప్పాడు.

ఈ మాటకు అందరూ సమ్మతించారు. ఎందుచేతంటే, వారంతా గోమంతం దగ్గిర అవమానం పొందినవారే. పై పెచ్చు వారిలో జరాసంధుడి దాయాదులూ, సగోత్రీకులూ, మిత్రులూ, బంధువులూ ఉన్నారు. పౌండ్ర, కళింగ, దంతవక్త్ర, శిశుపాల, సాల్వ, రుక్మి, గాంధార, త్రిగర్త, భగదత్తులూ, మరికొందరు కృష్ణద్వేషులూ; అంగ, వంగ, విదేహ, కాశ, కరూశ, మద్ర, పాండ్య మొదలైన దేశాల రాజులు కూడా జరాసంధుడి పక్షాన పోరాడటానికి సిద్ధంగా ఉన్నారు. తిరిగి ఇరవైఒక్క అక్షౌహిణీల సేన సమకూడింది. వాళ్ళు అంచె ప్రయాణాల మధురానగరాన్ని చేరవచ్చి, నగరం చుట్టూ ఉండే తోటలలో యమున పొడుగునా విడిశారు.

కృష్ణుడు మొదలైనవాళ్ళు కోట గోడలెక్కి చూస్తే జరాసంధుడి సేన ప్రళయానికి ముందుండే సముద్రం లాగా కనబడింది. కృష్ణుడు బలరాముణ్ణి చూసి నవ్వుతూ, "భూభారం తగ్గించటానికి దేవుడీ ఏర్పాటు చేసినట్టున్నది.'' అన్నాడు.

ఇద్దరూ కలిసి సేనలతో శత్రువును ఎదిరించటానికి నిశ్చయించారు.

జరాసంధుడు తన వెంట వచ్చిన రాజులతో తన యుద్ధ తంత్రం ఈ విధంగా చెప్పాడు. వెంటనే సేనలు మధురానగరాన్ని చుట్టుముట్టాలి. గునపాలతో కోటగోడలు అక్కడక్కడా బద్దలుకొట్టాలి. నగరాన్ని పూర్తిగా నాశనం చెయ్యాలి. గోమంతపర్వతాన్ని చుట్టుముట్టినప్పుడు ఎవరెవరు ఏయే దిక్కులలో నిలబడ్డారో, అదేవిధంగా మధుర చుట్టూ కూడా నిలబెట్టాడు జరాసంధుడు.

ఈసారి యాదవులు జరాసంధుడితో యుద్ధమంటే జంకలేదు. నిజానికి జరా

సంధుడి బలాలముందు తమ బలాలు ఎందుకూ పనికిరావు. కాని తమ వెంట కృష్ణుడున్నాడు. అదే వారి ధైర్యం. గరుత్మంతుడి జెండా గల రథంలో చక్రం మొదలుగా గల ఆయుధాలు పెట్టుకుని కృష్ణుడూ; నాగలీ, రోకలీ మొదలైన ఆయుధాలు వెంటబెట్టుకుని బలరాముడూ యుద్ధానికి వస్తుంటే చాలా కనులపండువుగా కనిపించింది. వాళ్ళిద్దరూ ఉగ్రసేనుడితో సహా తమ సేనకు ముందుండి నడుస్తూ, జరాసంధుడి సేనను సమీపించారు. తన సేనకు ముందు నిలబడి ఉన్న జరాసంధుడు వాళ్ళను ఎదుర్కొని, కృష్ణుడి పక్కనే ఉన్న ఉగ్రసేనుడితో, "భోజవంశం వారు రాజ్యాలేలితే, యాదవులు వారికి సేవచేస్తారు. అలాటి భోజవంశంలో పుట్టి కూడా నువు వంశ ప్రతిష్ఠ పోగొట్టుకున్నావు. నీకన్న మూర్ఖుడుంటాడా? ఈ కృష్ణుడు నీ కొడుకును చంపి రాజ్యం కాజేసి, ఉత్త సింహాసనం మటుకు నీకిచ్చాడు. వాడు పెట్టే పిండాకూడు తింటున్నావు. ఎందుకు? ఏళ్లు వచ్చాయి! నీదీ ఒక జన్మేనా? సిగ్గులేక ఈ భోగం ఎలా అనుభవిస్తున్నావు? కృష్ణుడికి నువు బంటువు తప్ప రాజువు కావు," అన్నాడు కోపంగా.

కృష్ణుడిది విని మండిపడి, "గౌరవనీయుడైన ఉగ్రసేనుణ్ణి నిందించటంలోనే ఉన్నదా ఏమిటి నీ పౌరుషం? ఏమైనా అనదలిస్తే నన్నే అను. నీకు నేనేగదా





బలరాముడు చెలరేగి తన పక్షం వాళ్ళను మందను తోలినట్టు తోలటం చూసి జరాసంధుడు అతన్ని ప్రతిఘటించాడు. ఇద్దరూ ఒకరి రథాలొకరు ధ్వంసం చేసుకుని, గదాయుద్ధానికి దిగారు. వాళ్ళ యుద్ధం చూడటానికి మిగిలినవాళ్ళంతా యుద్ధం మానేశారు. వాళ్ళిద్దరూ ఒకరి దెబ్బలు ఒకరు ఒడుపుగా తప్పించుకుంటూ, ఒకరినొకరు గదలతో మోదుకుంటూ, రక్తధారలు కార్చుతూ, భూమి దద్దరిల్లేలాగా, రెండు పెద్దపులుల మాదిరి యుద్ధం చేశారు. చివరకు ఎవరిని ఎవరూ చంపకుండానే ఆ గదా యుద్ధం ముగిసింది.

అసలు విరోధిని? ఆ రోజు గోమంతం దగ్గిర నాతో యుద్ధం చేసినవాడవే గదా! ఇంతలోనే ఆ సంగతి మరిచిపోయి, హాస్యాస్పదంగా మాట్లాడకు. ఈసారైనా పారిపోకుండా నిలిచి యుద్ధం చెయ్యి, నా ప్రతాపం పూర్తిగా చూతువుగాని.'' అని, జరాసంధుణ్ణీ, సారథినీ బాణాలతో కొట్టి, అతని విల్లు విరగగొట్టాడు.

ఉభయపక్షాల వీరుల మధ్య తీవ్రంగా యుద్ధం సాగింది. ఈ యుద్ధంలో ఉగ్రసేనుడు కూడా గొప్ప పరాక్రమం ప్రదర్శించాడు. ఒకసారి కృష్ణుడికీ, రుక్మికీ ద్వంద్వ యుద్ధం జరిగింది. అందులో రుక్మి చిత్తుగా ఓడి తప్పుకు పోయాడు.

ఈ విధంగా కొన్ని రోజులపాటు యుద్ధం జరిగింది. జరాసంధుడు కోరిన విధంగా అతనికి విజయం లభించలేదు. అతని బలాలు రోజు రోజుకూ క్షీణిస్తున్నాయి. అతను ప్రాణం విసిగి, దైవం తనకు అనుకూలించటం లేదనుకుని, తన పక్షాన వచ్చిన రాజులనూ, సేనలనూ వెంట బెట్టుకుని మగధకు తిరిగిపోయాడు.

కాని జరాసంధుడు అంతటితో వదలలేదు. ఇదేవిధంగా అతను మధుర మీదికి పద్దెనిమిది సార్లు దండెత్తి వచ్చాడు. కృష్ణుణ్ణి చంపటం జరాసంధుడి వల్లా కాలేదు. జరాసంధుణ్ణి చంపటం కృష్ణుడి

వల్లా కాలేదు. కారణం, జరాసంధుడు మరొకరి చేతిలో చావవలిసి ఉన్నాడు.

రోజులు సుఖంగా గడుస్తున్నాయి. బలరాముడికి తన చిన్ననాటి విషయాలన్నీ జ్ఞాపకం వచ్చి, ఒకసారి గోకులం చూడాలనిపించింది. కృష్ణుడితో చెబితే అతన్ని వెళ్ళిరమ్మన్నాడు; కాని తాను బయలుదేరలేదు. బలరాముడు అరణ్య ప్రాంతాలకు తగిన వేషం వేసుకుని వ్రేపల్లెకు వెళ్ళాడు. అతన్ని అంతదూరంలోనే చూసి గోపకులు పరమానందంతో ఎదురు వెళ్ళారు. బలరాముడు కొందరికి దణ్ణాలు పెట్టాడు, కొందరిచేత దణ్ణం పెట్టించుకున్నాడు, మరి కొందరిని కౌగిలించుకున్నాడు. గోపికలందరూ అతని చుట్టూ మూగితే వారందరినీ ప్రేమగా పలకరించాడు.

వృద్ధగోపులు అతన్ని తమ మధ్య కూర్చోబెట్టుకుని ఇష్టాగోష్ఠి జరిపారు.

"నాయనా, నువు రావటం గొప్ప విశేషం. ఎటువంటి వాళ్ళకైనా జన్మస్థలం మీద ప్రేమ పోదనటానికి ఏం నిదర్శనం కావాలి? మీ అన్నదమ్ములు చాణూర ముష్టికులను చంపారు, కంసుణ్ణి హతమార్చారు, గోమంతం దగ్గిర మహాసేనను జయించారు, సృగాలవాసుదేవుణ్ణి చంపారు, ఎంతో కీర్తి సంపాదించారు. అయినా నువు గోవులను కాచినచోటు వెతుక్కుంటూ వచ్చావు!" అన్నారు గోపవృద్ధులు.

"మీరు పెంచబట్టేగదా మాకీ ఖ్యాతి వచ్చింది? అయినా, మీవంటి బంధువులు కావాలంటే మటుకు అందరికీ దొరుకుతారా? నాకూ, నా తమ్ముడికీ ఆ రాజభోగాల మీద మనసు పోదు. ఇక్కడ చిన్నతనంలో హాయిగా గడిపిన రోజులు మరుద్దామన్నా మరవలేం," అన్నాడు బలరాముడు.

ఈ మాటకు అందరూ సంతోషించి అతను తాగటానికీ, తినటానికీ ఉత్తమమైన పానీయాలూ, భక్ష్యాలూ పెట్టి ఎంతో ప్రేమతో ఆదరించారు.





# ఇంద్రజాలం

చిత్రసేనుడనే, ఒక రాజు భార్యకు వినోదాలంటే యిష్టం. అందునా, ఇంద్రజాలమంటే చాలా మక్కువ. ఒకసారి రాజు, భార్యకోరికపై, అందరికంటే గొప్ప ఇంద్రజాల ప్రదర్శన యిచ్చిన వాడికి లక్ష వరహాలిచ్చి సత్కరించగలనని ప్రకటించాడు.

ఆ ప్రకటన విని ఎందరో ఐంద్రజాలికులు, రాజధానికి వచ్చిచేరారు. ప్రదర్శన చూడడానికి రాజు, పెద్ద మందిరం ఏర్పాటు చేయించాడు.

వచ్చిన ఐంద్రజాలికులు అద్భుతమైన ప్రదర్శనలు చేశారు. ఒకడు గాలిలో నడిచాడు. ఇంకొకడు మనుషులను కోతులుగా మార్చి, వాటి చేత మాట్లాడించాడు. మరొకడు ప్రదర్శనా మందిరంలో భూకంపం తెప్పించాడు. ఇలా ఒకటేమిటి? న భూతో న భవిష్యతి, అనేటటువంటి ప్రదర్శనలెన్నో జరిగాయి.

ప్రదర్శనలైపోయాక రాజుకు, వారిలో అందరికంటే గొప్ప ప్రదర్శన యిచ్చిన వారెవరో తెలుసుకోవడం కష్టమయింది. ఆయన మందిరంలోని సభికుల వంక చూసి, "మీలో ఉత్తమ ఐంద్రజాలికుడిని ఎన్నిక చేసినవాడికి, పదివేలవరహాలు కానుకగా యిస్తాను." అన్నాడు.

ఆ వెనువెంటనే సభికుల్లో కలకలం బయల్దేరింది. ప్రతి ఒక్కడూ ముందుకు వచ్చి, ఏదో ఒక ఐంద్రజాలికుడి పేరు చెప్పసాగాడు. వాళ్ళను అదుపు చేయడమే కష్టమైపోయింది.

ఆ సమయంలో జాలానందుడనే ఐంద్రజాలికుడు, తన ఇంద్రజాల ప్రభావంతో సభికుల్ని సమ్మోహితుల్ని చేసి, అదుపులో పెట్టి, రాజు వంక తిరిగి, "ప్రభూ, మా గొప్పతనాన్ని సభికులు నిర్ణయించలేరు. నిర్ణయించగల తమరే



సందిగ్ధంలో పడ్డారు. కాబట్టి, యిప్పుడొకే ఒక్క ఉపాయం మిగిలింది!'' అన్నాడు.

''ఏమిటో చెప్పు!'' అన్నాడు చిత్రసేనుడు కుతూహలంగా.

''మా ఇంద్రజాల విద్య గొప్పతనాన్ని, మా ఐంద్రజాలికులే అంచనా వేయగలరు. మాలో నిష్పక్షపాత బుద్ధి ఎక్కువ. కాబట్టి మేమందరం, మేము మెచ్చిన ఐంద్రజాలికుడి పేరు ఒక చీటీ మీద రాసి మీకిస్తాం. ఎక్కువ మంది ఎవరి పేరు రాస్తే, అతడే ఉత్తమ ఐంద్రజాలికుడవుతాడు,'' అన్నాడు జాలానందుడు.

చిత్రసేనుడు దీనికి అంగీకరించాడు. కొద్దిసేపటిలో ఐంద్రజాలికులందరూ రాజుకు చీటీలిచ్చారు. చదివి చూడగా అన్ని చీటీలలో జాలానందుడి పేరున్నది.

ఇది విని ఒక ఐంద్రజాలికుడు ముందుకు వచ్చి, ''ప్రభూ, ఇందులో ఏదో మోసమున్నది. నేను జాలానందుడి పేరు రాసిన మాట నిజం. కానీ నా అభిప్రాయంలో, అతడికంటే నేనే గొప్పవాణ్ణి,'' అన్నాడు.

''అలాంటప్పుడు, నీ పేరు రాయక, జాలానందుడి పేరెందుకు రాశావు?'' అని ప్రశ్నించాడు చిత్రసేనుడు.

''ప్రభూ, జాలానందుడు మోసం చేశాడు. మమ్మల్నందర్నీ ఇంద్రజాల ప్రభావానికి గురిచేశాడు. న్యాయనిర్ణయానికి ఇంద్రజాలవిద్యను ప్రయోగించడం, నియమవిరుద్ధం!'' అన్నాడు ఐంద్రజాలికుడు.

మిగతా ఐంద్రజాలికులు కూడా, ఆ విషయాన్ని ధృవపరిచారు. జాలానందుడు వెంటనే, రాజుతో, ''ప్రభూ, న్యాయనిర్ణయానికి ఇంద్రజాలవిద్యను ప్రయోగించడం, నియమవిరుద్ధం అన్నమాట నిజం. అయితే, ఎందరినో సమ్మోహితుల్ని చేయగల ఐంద్రజాలికుల్ని, సమ్మోహితులను చేయడం సాధ్యమా అని, చాలా మందికి సందేహముంటుంది. ఆ సందేహం తీర్చడం కోసం, నేను చేసిన అఖరు

ప్రదర్శన యిదితప్పితే—న్యాయనిర్ణయం మాత్రం కాదు. న్యాయనిర్ణయం ప్రభువులకే వదిలిపెడుతున్నాను," అన్నాడు.

రాజు చిరునవ్వునవ్వి. "ఐంద్రజాలికులపైనే, తన ఇంద్రజాలవిద్యాప్రభావాన్ని చూపగలిగిన జాలానందుడే ఉత్తమ ఐంద్రజాలికుడు!" అని ప్రకటించాడు.

ఇందుకు మిగిలిన ఐంద్రజాలికులు కూడా, అంగీకరించక తప్పలేదు.

అప్పుడు చిత్రసేనుడు, జాలానందుడికి లక్షవరహాలు బహుమతిగా యిచ్చి, "నీ ప్రదర్శన అద్భుతం. నీకు తెలిసి, నీకంటే గొప్ప ఐంద్రజాలికులున్నారా?" అని అడిగాడు.

"లేకేం, ప్రభూ! నా భార్య వున్నది. ఆమె అందం ఇంద్రజాలంలా నా మీద పని చేసి, నన్నామెకు దాసుణ్ణి చేసింది. ఆమె కోసమే, నేనీ ఇంద్రజాల విద్యనేర్చుకున్నాను," అన్నాడు జాలానందుడు.

చిత్రసేనుడికి సమాధానం నచ్చలేదు. "నీ ఇంద్రజాలం తాత్కాలికమైన భ్రమ. నీ భార్య అందం భ్రమ కాదు గదా! అది ఇంద్రజాలమెలా అవుతుంది?" అన్నాడు.

జాలానందుడు వెంటనే, "ఇంద్రజాల భ్రమ కొద్దిగంటలుంటే, సౌందర్యభ్రమ కొన్ని సంవత్సరాలుంటుంది. ప్రభూ! ఈ ప్రపంచంలో ఏది శాశ్వతం? అంతా భగవంతుడి ఇంద్రజాలమే కదా! నా భార్య అందం పది సంవత్సరాల తర్వాత మాయమయ్యేదే కదా!" అన్నాడు.

రాజు, జాలానందుడికి మరొక లక్ష వరహాలు కానుకగా యిచ్చి, "నేను కూడా నా భార్య సౌందర్యపుటారాధనలో పడి, ప్రజాక్షేమాన్ని విస్మరించి విలాసాలలో మునిగి తేలుతున్నాను. నీ మాటలు నా భ్రమను తొలగించాయి. అందుకే యీ కానుక," అన్నాడు.

జాలానందుడు తృప్తిపడి, అక్కడి నుంచి వెళ్ళిపోయాడు. అతడి ఇంద్రజాలం రాజును ప్రజాక్షేమానికి అంకితం చేసిందని, ప్రజల్లో అతడికి మరింత పేరు వచ్చింది.





# ధీరానందుడు

పూర్వం దండకారణ్యంలో యోగానందుడనే మహాసిద్ధుడు గోదావరీ తీరాన ఆశ్రమం కల్పించుకుని ఉంటూ ఉండేవాడు. యోగవిద్యలో ఆయనవద్ద శిక్షణ పొందటానికని అన్ని కులాలవాళ్ళూ వచ్చి ఆయనకు శుశ్రూష చేస్తూండేవారు. ఒక సంవత్సరంపాటు పరీక్షించినమీదట వారు తనవద్ద యోగవిద్య నేర్చుకోవటానికి అర్హులని తోచినట్టయితే శిష్యులుగా చేర్చుకునేవాడు. లేనట్టయితే ఇంటికి పంపేస్తూండేవాడు.

యోగానందుడు అప్పుడప్పుడూ తన ఆశ్రమం వదిలి అరణ్యంలో ఇతర ప్రాంతాలకు తన శిష్యులతోసహా వెళుతూ ఉండేవాడు. అక్కడ ఆయన శిష్యులు ఎన్నో కొత్త విషయాలు నేర్చుకుంటూ ఉండేవారు; అనేక స్థలదేవతలను పరిచయం చేసుకునేవారు. అనేక రకాల బ్రహ్మరాక్షసులను లొంగదీయటం అభ్యసించేవారు.

ఒక ఏడు యోగానందుడివద్ద శిష్యత్వం చెయ్యటానికి ధీరసింహుడనే క్షత్రియ కుమారుడు వచ్చాడు. ఇతను చిన్నవాడైనా అనేక యుద్ధాలలో ఆరితేరినవాడు. అతనికి భయమనేది ఎలా ఉంటుందో తెలియదు. అందరిలాగే అతను కూడా ఒక ఏడాది పరీక్షకింద ఉన్నాడు. ఏడాది పూర్తి కావచ్చింది.

ఆ సమయంలో యోగానందుడు తన శిష్యులతోసహా బయలుదేరి ఒక సరస్సు వద్దకు వెళ్ళి చేరాడు. సరస్సు ఒడ్డున చిన్న పర్ణశాల వేశారు.

ఈ పర్ణశాలకు కొంత దూరంలో ఒక బ్రహ్మాండమైన మర్రిచెట్టున్నది. అది దాదాపు ఒక వంద ఎకరాలు ఆక్రమించి ఉన్నది.

25-ఏళ్ళనాటి చందమామ కథ

సరస్సువద్దకు చేరిన రాత్రి యోగా నందుడు తన శిష్యులతో, "ఈ మర్రి చెట్టు బహుపురాతనమైనది. దీనికింద త్రేతాయుగం నాటి పిశాచాలు కూడా ఉన్నాయి. వాటి సంగతి తరవాత నింపాదిగా చెబుతాను. ఈ రాత్రికి మటుకు మీలో ఎవరు కూడా ఆ మర్రిచెట్టు చాయలకు వెళ్ళవద్దు. గుర్తుంచుకోండి, ఇది నా ఆజ్ఞ!" అన్నాడు.

ఆ రాత్రి అందరూ భోజనాలు చేసి పడుకుని నిద్రపోయారు. అందరితోబాటు ధీరసింహుడు కూడా నిద్రపోయాడు. కాని ఒక రాత్రివేళ అతనికి మెలకువ వచ్చేసి, తిరిగి ఎంత ప్రయత్నించినా నిద్రపట్టలేదు. అతను ఆశ్రమం బయటికి వచ్చి దూరాన ఉన్న పిశాచాల మర్రిని చూశాడు.

ఎన్నడూ భయ్యం ఎరగనివాడు కావటం చేత అతను ఆ చెట్టుకిందికి వెళ్ళదలుచుకుని బయలుదేరాడు. మర్నాడు గురువుగారు చెప్పేలోపుగానే ఆ చెట్టు గురించి కొన్ని విషయాలైనా స్వయంగా తెలుసుకోవాలని అతనికి అపుకోరాని కోరిక పుట్టింది.

అతను మర్రిచెట్టును సమీపించి దానికిందుగా, ఊడల మధ్యగా నడవసాగాడు. అతను కొంతదూరం వెళ్ళేసరికల్లా ఒక ఊడ నుంచి దిగుతూ ఒక తెల్లని ఆకారం



కనిపించింది. అది నేలకు దిగి నిలబడగానే ధీరసింహుడు గంభీరంగా, "ఎవరు నువు?" అని ప్రశ్నించాడు.

"నా పేరు అనుకంపనుడు. ఈ అరణ్యంలో రాముడి భార్య సీత ఉన్నదని రావణుడికి చెప్పినవాణ్ణి నేనే!" అన్నాడు ఊడ దిగినవాడు.

ధీరసింహుడు చలించలేదు. "నువు ఇంకా ఇక్కడే ఉంటున్నావా?" అని అతను అనుకంపనుణ్ణి అడిగాడు.

"ఎక్కువగా నరకంలో ఉంటూంటాను. వాళ్ళు రానిచ్చినప్పుడు ఈ చెట్టు మీదికి వస్తూంటాను," అన్నాడు అనుకంపనుడు, మెల్లిగా దగ్గిరికి జరుగుతూ.



"ఓహో, నరకంలో మీ వాళ్లంతా ఎలా ఉన్నారు?" అన్నాడు ధీరసింహుడు, ఎంతో ధైర్యంగా, వున్నచోటనే నిలబడి. అనుకంపనుడు తనను మెల్లిగా సమీపిస్తూ ఉండటం అతను గమనిస్తూనే ఉన్నాడు.

"ఎలా ఉన్నారని చెప్పను! నరక జ్వాలలలో మగ్గి నానా సతమతమూ అవుతున్నారు," అన్నాడు అనుకంపనుడు.

"నరకబాధకు అందరికన్న ఎవరు బాగా తట్టుకుంటున్నారు!" అన్నాడు ధీరసింహుడు.

"అందరికన్న రావణుడు మెరుగు," అన్నాడు అనుకంపనుడు.

"రావణుడికి ఏమి శిక్ష విధించారేం?" అన్నాడు ధీరసింహుడు.

"నూనెభాండీలను కాచమన్నారు!"

"అదేమంత కష్టమైన పనికాదే?"

"నూనెభాండీల కింద కాలుతున్నది రావణుడే!"

"అలా చెప్పు! అది నిజంగా బాధే. అయితే, నరకబాధను బొత్తిగా భరించలేకుండా ఉన్నవాడెవడు?" అని ధీరసింహుడు అడిగాడు. అనుకంపనుడు కొంచెంకొంచెమే తనకు దగ్గిరిగా జరుగుతూండటం అతను గమనిస్తూనే ఉన్నాడు. కాని, అతడు భయం కనబరచలేదు.

"కుంభకర్ణుడు నరకబాధ ఏమాత్రమూ భరించలేక రాత్రింబగళ్ళు ఒకే తీరున రంకెలు పెట్టి, మిగిలినవాళ్ళకి నిద్ర లేకుండా చేస్తున్నాడు," అన్నాడు అనుకంపనుడు.

"కుంభకర్ణుడికి ఏమి శిక్ష ఇచ్చారేం?" అన్నాడు ధీరసింహుడు.

"చీలమండలదాకా నిప్పుపెట్టారు," అన్నాడు అనుకంపనుడు.

"ఆ బాధకే రంకెలు పెడుతున్నాడా?" అన్నాడు ధీరసింహుడు ఆశ్చర్యంగా.

"నిప్పులో కుంభకర్ణుడు తలకిందులుగా వేళ్ళాడుతున్నాడు," అన్నాడు అనుకంపనుడు.

"అలా చెప్పు! అది నిజంగా బాధే. అయితే కుంభకర్ణుడు పెట్టే రంకెలు ఎలా ఉంటాయో నాకు వినిపించగలవా?" అని ధీరసింహుడు అడిగాడు.

"ఓ, వినిపిస్తాను!" అంటూ అనుకంపనుడు గూబలు అదిరేటట్టుగా భయంకరమైన రంకె పెట్టాడు. ధీరసింహుడు చెవులు గట్టిగా మూసుకోవలసి వచ్చింది.

"ఇంతేనా? గొర్రె అరిచినంత కూడా లేదే! కుంభకర్ణుడి రంకె నీకు సాధ్యం కాదేమో?" అన్నాడు ధీరసింహుడు.

"ఈసారి విను!" అంటూ అనుకంపనుడు భూమి దద్దరిల్లేటట్టు మరొక రంకె పెట్టాడు. ధీరసింహుడు చెవులు రెండూ గట్టిగా మూసుకున్నప్పటికీ అతని తల దిమ్మెక్కిపోయింది.

"ఇంతేనా? గట్టిగా గుర్రం సకిలించినట్టు కూడా లేదు. కుంభకర్ణుడు ఇంతకన్న పెద్ద రంకెలే పెట్టి ఉంటాడు. వాటిని నువ్వు చూపించలేకుండా ఉన్నావు!" అన్నాడతను.

"ఈసారి విను!" అంటూ అనుకంపనుడు ఊపిరి బాగా పీల్చి బ్రహ్మాండమైన పెడబొబ్బ పెట్టాడు. ధీరసింహుడు చెవులు ఎంత గట్టిగా మూసుకున్నా ప్రయోజనం లేకపోయింది. అతనా పెడబొబ్బకు స్పృహ తప్పి పడిపోయాడు.

అదే సమయమనుకుని అతన్ని మింగటానికి అనుకంపనుడు ముందుకు వచ్చాడు. ఈ లోపుగా అనుకంపనుడు పెట్టిన పెడబొబ్బలు విని యోగానందుడు మేలుకుని, ఆశ్రమం నుంచి వచ్చి, తన కమండలంలోని జలాన్ని అనుకంపనుడిపై చల్లాడు. అనుకంపనుడు ఆ దెబ్బతో భూమిలో దూరి పాతాళానికి పారిపోయాడు.

తరవాత యోగానందుడు ధీరసింహుణ్ణి లేపి, తన ఆశ్రమానికి తీసుకుపోయి జరిగినదంతా విని, "నాయనా, నా ఆజ్ఞ మీరినప్పటికీ నీ ధైర్యానికి మెచ్చాను. నేటినుండి నీవు ధీరానందుడని పేరు పెట్టుకుని నా శిష్యుడివికా!" అని అతనికి యోగం ఉపదేశించాడు.





# కవి - విమర్శకుడు

కోమరగిరి రాజుగారి ఆస్థానంలో, రామశర్మ అనే కవి వుండేవాడు. ఆయనకు సాహిత్య విమర్శకులంటే, చాలా చులకన భావం వుండేది. పాఠకుడు కావ్యాన్ని చదివి ఆనందిస్తే చాలు. అంతేగాని, దాన్ని గురించిన విమర్శా, వ్యాఖ్యాన్నాల్లాంటివి శుద్దదండగ, అంటూండే వాడాయన.

రాజుగారు మాత్రం కవులనూ, విమర్శకులైన పండితులనూ సమానంగా ఆదరించేవాడు. ఇది ఏమాత్రమూ నచ్చని రామశర్మ, ఒకనాడు నిండు సభలోనే, విమర్శకులపట్ల తనకున్న అభిప్రాయాన్ని వెల్లడించాడు.

ఒకనాడు రాజు, రామశర్మను పిలిపించి, "శర్మగారూ, మీరు గోవిందపురం వెళ్ళి, అక్కడి జమీందారు భుజంగపతిని కలుసుకుని, మీరా మధ్య రాసిన కావ్యం గురించి, ఆయన అభిప్రాయం ఏమిటో తెలుసుకోండి. తర్వాత, ఆయన ఏమన్నదీ, నాకు చెప్పండి," అన్నాడు.

రామశర్మ, గోవిందపురంవెళ్ళి, జమీందారును కలుసుకుని, తన కావ్యం గురించి అభిప్రాయం అడిగాడు.

భుజంగపతి విచారంగా, "కవిగారూ, మీ కావ్యాన్ని నేనొకసారి చదివాను. అది చాలా ప్రౌఢకావ్యం. సరిగా అర్థంకాలేదు. దాని మీద ఏ వ్యాఖ్యానమో వచ్చివుంటే బావుండేది. అప్పుడు, నాబోటివాడికి సరిగా అర్థమయ్యేది," అన్నాడు.

రామశర్మ తిరిగివచ్చి, రాజుకు భుజంగపతి అన్నదేమిటో చెప్పాడు.

"అయితే, శర్మగారూ, మీరీసారి రంగపట్నం వెళ్ళిరండి. అక్కడ వల్లభుడనే విద్వాంసుడున్నాడు. ఆయనను కలుసుకుని, మీ కావ్యం గురించి ఆయన అభిప్రాయం సేకరించండి," అన్నాడు రాజు.

తాటిచెర్ల గురురామప్రసాద్

రామశర్మ, వల్లభుడిని దర్శించి, తాను వచ్చినపని చెప్పాడు.

వల్లభుడు ఎంతో వినయంగా, "కవి వర్యా, తమ కావ్యం గొప్ప ఉత్తమ గ్రంథం. వస్తు శిల్ప నిర్మాణంలో, మీరు కనబరిచిన ప్రతిభ అమోఘం. అయితే, దానిలో కొన్ని నెరసులు లేకపోలేదు. దోషాలున్నా, అవి చంద్రునిలో మచ్చల్లాంటివే!" అంటూ వల్లభుడు, ఆ కావ్యం యొక్క సౌందర్య హేతువులతోపాటు, అవగుణాలను కూడా వివరించాడు.

తిరిగివచ్చిన రామశర్మ చెప్పినది విన్న రాజు, ఈసారి ఆయనను నగరంలోని శౌరిశాస్త్రిని కలవమన్నాడు.

"శర్మగారూ, ముందుగా మీ కావ్యం మీద వల్లభుడి విమర్శ వినిపించి, దాని మీద శౌరిశాస్త్రిగారి అభిప్రాయాన్ని కనుక్కోండి," అన్నాడు రాజు.

రామశర్మ, శౌరిశాస్త్రిని చూడబోయాడు. ఆయన రామశర్మ చెప్పింది పూర్తిగా విని, "కవివరేణ్యా! మీ కావ్యంమీద వల్లభుడు చేసిన విమర్శ అంతలోతైనదీ, ప్రతిభా పూర్వకమైనదీ కాదు!" అంటూ, ఆ విమర్శలోని లోపాలను, మహాపండితుడైన శౌరిశాస్త్రి అతి సున్నితంగా ఎత్తి చూపాడు.

రామశర్మ ఇల్లు చేరుకుని, తన యీ పర్యటనానుభవాలను సమీక్షించుకున్నాడు: విమర్శ అనేదే లేకుంటే, భుజంగపతిలాంటి సామాన్యులకు, తన కవిత్వం అర్థం కాదు. వల్లభుడి విమర్శ తాను విని వుండకపోతే, తన కావ్యంలోని లోటుపాట్లు, తనకు తెలిసేవికాదు. అందువల్ల, తాను ఇకముందు రాయబోయే కావ్యాల్లో, ఈ అవగుణాలు రాకుండా చూసుకునే అవకాశం పోయేది. శౌరిశాస్త్రి ప్రతివిమర్శ వల్ల, వల్లభుడిలాంటి విమర్శకుల స్థాయి పెరిగేందుకు వీలుంటుంది— అని రామశర్మ గ్రహించాడు.

సాహిత్యం మీద విమర్శ అనవసరమనే దురభిప్రాయం, రామశర్మలో మరి లేదని తెలిసి, రాజు చాలా సంతోషించాడు.






# మిరియపుగింజ

పూర్వం నానాజీ అనే రాజపుత్రబాలుడు ఉండేవాడు. అతని చిన్నతనంలోనే తండ్రి పోవటం చేత అతను తన పెత్తండ్రుల అండన పెరిగాడు.

వాళ్ళు నానాజీకి రాజపుత్ర సంప్రదాయాలన్నీ నేర్పారు. అతను పసితనంలోనే గుర్రపు స్వారీ, విలువిద్యా, అస్త్ర విద్యలూ చక్కగా నేర్చుకున్నాడు.

ఒక పొగరుబోతు గుర్రాన్ని ఎవరూ అదుపు చెయ్యలేకపోగా, నానాజీ దాన్ని అదుపులోకి తెచ్చి, మచ్చిక చేసి, దాన్ని ఎక్కి తిరగసాగాడు. తన పెత్తండ్రులు గుర్రాలెక్కి తిరిగేటప్పుడు నానాజీ వారి వెంట తాను కూడా తిరిగేవాడు. ఆ గుర్రం కూడా నానాజీని తప్ప మరెవరినీ ఎక్కనిచ్చేదికాదు.

ఒకనాడు ఒక వర్తకుడు రాజభవనానికి కాంగ్డా నుంచి కొన్ని ఖడ్గాలు తెచ్చాడు. నానాజీ ఆ కత్తులవద్ద కూర్చుని ఒకొక్క కత్తి నిడివీ, పదునూ పరీక్షించి, ఏదీ నచ్చక, ఒకొక్కటే తీసి పక్కన పెడుతూ వచ్చాడు.

"ఈ అబ్బాయికి ఖడ్గాల నాణ్యం బాగా తెలుసులాగున్నదే!" అనుకుని వర్తకుడు మంచి ఖడ్గం ఒకటి తీసి నానాజీకి చూపించాడు.

ఆ కత్తిని చూడగానే నానాజీ కళ్ళు మెరిశాయి. "నాకిలాటి ఖడ్గమే కావాలి. ఇది ఉంటే నన్నెవరూ జయించలేరు!" అన్నాడతను ఉత్సాహంతో.

అతను ఆ ఖడ్గాన్ని తన పెత్తండ్రుల వద్దకు తీసుకుపోయి దాన్ని తనకు కొని పెట్టమని అడిగాడు.

"మేము బతికి ఉండగా నీకు ఖడ్గంతో ఏం పని, బాబూ?" అని ఒక పెత్తండ్రి అడిగాడు.

రాజపుత్ర జానపద కథ

''ఈ ఖడ్గం మరీ పెద్దది. నువు పట్ట లేవు,'' అన్నాడు మరొక పెత్తండ్రి.

''నేను పెరిగిపోతున్నాను. నాకున్న ఖడ్గం మరీ చిన్నదిగా ఉన్నది,'' అన్నాడు నానాజీ.

''ఖడ్గం పొడుగుగా ఉండటం ముఖ్యం కాదురా! దాన్ని పట్టిన వాడి ధైర్యసాహసాలు ముఖ్యం. ఖడ్గం పొడుగు తక్కువైనప్పుడు, శత్రువు కేసి ఒక అడుగు ముందుకు పోయి పోరాడాలి,'' అన్నారు నానాజీతో పెత్తండ్రులు.

నానాజీ నిరాశ చెంది, ఆ ఖడ్గాన్ని వర్తకుడికి తిరిగి ఇచ్చాడు.

కొన్నాళ్ళు గడిచాక కొందరు బందిపోటు దొంగలు గ్రామం మీద పడి, ఆవుల మంద లన్నిటినీ తోలుకుపోయారు. అలాటిది జరిగినప్పుడు గ్రామస్థులు డప్పులు వాయించటం రివాజు.

రాజభవనంలో ఉన్న నానాజీకి డప్పుల మోత వినిపించింది. ఆ మోత ఏమిటని అతను అడిగితే, దొంగలు పశువులను తోలుకు పోతున్నారని చెప్పారు.

నానాజీ తనలో, ''కోటలో నేను ఉండి కూడా ఈ అన్యాయం జరగనిస్తానా? మా పెత్తండ్రులకు ఎంత అవమానం? మా అమ్మ నన్ను చూసి సిగ్గుపడదా?'' అనుకున్నాడు.

అతను వెంటనే తన గుర్రం ఎక్కి, ఖడ్గం ఝళిపిస్తూ, బందిపోటు దొంగల వెనకగా దౌడు తీశాడు.



అరణ్యం లోపలగా అతను దొంగలను కలుసుకున్నాడు.

దొంగల నాయకుడు ఆ కుర్రవాణ్ణి చూసి నవ్వి, "బుడ్డవాడా, నీ కింకా మీసకట్టయినా రాలేదు గదా. మా నుంచి పశువులను ఎలా తీసుకుపోదా మను కుంటున్నావు?" అన్నాడు.

ఇది మాటలతో తేలే విషయం కాదను కుని నానాజీ తన గుర్రాన్ని దొంగల నాయకుడికి దగ్గిరగా నడిపి, తన కత్తితో అకస్మాత్తుగానూ, బలంగానూ, దొంగల నాయకుడి తలకేసి కొట్టాడు.

దొంగ తల పక్కకు తిప్పటంతో నానాజీ కత్తి దెబ్బకు అతని ముక్కూ, మూతీ తెగిపోయాయి.

వాడు ఆవేశంతో, "చంపండి కుర్ర కుంకని! చుట్టుముట్టి పట్టుకుని, ముక్క లుగా నరకండి!" అని అరిచాడు.

ఈ అడావుడిలో గోవులమంద గ్రామం కేసి పరిగెత్తి పోయింది. నానాజీ కూడా, తాను అంతమంది దొంగలతో పోరాడ లేనని గ్రహించి, గుర్రాన్ని వెనక్కు తిప్పి, దౌడు తీయించాడు.

దొంగలు నానాజీ వెంట పడ్డారుగాని, నానాజీ గుర్రం అతి వేగంగా పరిగెత్తటం చేత గ్రామాన్ని చేరేలోగా అతన్ని అందుకో లేకపోయారు.

గ్రామంలో పశువులు పోయాయని ఏడుస్తున్న గ్రామస్థులు, అవి తిరిగి రావటం చూసి ఆశ్చర్యపోయారు. నానాజీని చూసి వారు పొందిన ఆనందం ఇంతా అంతా కాదు.

అంత చిన్నవాడు దొంగల ముఠా నుంచి పశువులను ఎలా రక్షించాడో ఎవరికీ అర్థం కాలేదు.

తరవాత నానాజీతో అతని పెత్తండ్రులు, "ఇప్పటి నుంచే నీకీ దుడుకు దేనికిరా బాబూ? పెరిగి పెద్దవాడివైనాక ఎన్ని సాహస కార్యాలైనా చేద్దువు గాని!" అన్నారు.

"నేను చిన్నవాణ్ణి అయితే నేం? మిరియపుగింజను! ఘాటు జాస్తి!" అన్నాడు నానాజీ.



## ప్రకృతి వింతలు :


ఎగిరే స్తన్య జంతువు
నిజంగానే ఎగరడానికి శక్తిగల స్తన్య జంతువు—గబ్బిలం ఒక్కటే!


బ్రహ్మాండమైన గూడు!
ఆస్ట్రేలియాకు చెందిన మాల్లీ జాతి కోడి, గుడ్లు పెట్టడానికి 15 అడుగుల అడ్డుకొలతగల పెద్ద గూడు కట్టుకుంటుంది!


డాల్ఫిన్స్—షార్క్స్!
తిమింగిలం జాతికి చెందిన డాల్ఫిన్స్ పైకి కనిపించేటంత సాధు జలచరం కాదు. తమను వేటాడడానికి వచ్చే షార్క్ (సొర) చేపను ఇవి గుంపుగా కలిసి ఎదుర్కొని తరిమికొడతాయి. ఒక్కొక్కసారి తమ ముక్కులతో పొడిచి, సొరచేపను హతమారుస్తాయి కూడా!

# మీ పాపాయికి అందించండి సెరిలాక్ లాభం



## తొలిసారిగా ఘన పదార్థాలను ఇస్తూ

4 నెలల నుంచీ మీ పాపాయికి, పాలతోబాటు ఘన పదార్థాలు కావాలి. సెరిలాక్ రకాలన్నీ అందించండి.

పోషకాహార లాభం : సెరిలాక్ ప్రతి చెంచాడులోనూ మీ పాపాయికి కావలసిన పోషక పదార్థాలు, ప్రోటీన్లు, కార్బోహైడ్రేట్లు, కొవ్వు పదార్థాలు, విటమిన్లు, ఖనిజాలూ అన్నీ వున్నాయి. అన్నీ పసు పాలల్లో వున్నాయి.

రుచి లాభం : పాపాయిలకు సెరిలాక్ రుచి ఇష్టం.

సమయం ఆదా లాభం : సెరిలాక్ ముందుగా వండినది. దానిలో పాలూ, పంచదార వున్నాయి. దానికి వెచ్చటి నీటితో కలిపితే చాలు.

ఎంపిక లాభం : ఎంచుకునేందుకు మూడు రకాల సెరిలాక్ వుంది.

మీ పాపాయికి సమతూకంలో పోషకాహారాన్ని అందించేందుకూ, తయారుచేయటంలో పరిశుభ్రతను పాటించేందుకూ, డబ్బా మీది సూచనలను జాగ్రత్తగా పాటించండి.




6 మాసాలు నుంచి




4 మాసాలు నుంచి




6 మాసాలు నుంచి

ఉచితం
సెరిలాక్ బేబీ కేర్ బుక్
వ్రాయండి. సెరిలాక్
పోస్ట్ బాక్స్ నెం 3
న్యూ ఢిల్లీ 110008




**సెరిలాక్ రక్షణ: పోషకాహారంతో పరిపూర్ణం-ఎంతో రుచికరం**

RK SWAMY/FSL/3112/TEL

## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 50 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1988 డిసెంబర్ నెల సంచికలో ప్రకటింపబడును.



Pranlal K. Patel



D. N. Shirke

★ పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలో గానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) ★ అక్టోబర్ నెల 15వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. ★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 50/-లు బహుమానం. ★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి: - చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26

---

### ఆగస్టు నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో: ఎవరూ లేరు అండగా! రెండవ ఫోటో: బ్రతుకే ఒక పండుగ!!

పంపినవారు: భీమరశెట్టి భాస్కరరావు, ద్వారకానగర్, విశాఖపట్నం (ఆం. ప్ర)

బహుమతి మొత్తం రు. 50/- నెలాఖరులోగా పంపబడుతుంది.




Printed by B.V. REDDI at Prasad Process Private Ltd., 188 N.S.K. Salai, Madras 600 026 (India) and Published by B. VISHWANATHA REDDI on behalf of CHANDAMAMA PUBLICATIONS, Chandamama Buildings, Vadapalani, Madras 600 026 (India). Controlling Editor: NAGI REDDI.


---

# కొత్త హార్లిక్స్ బిస్కెట్స్.
# కొంతమంది మంచి రుచి నిపుణులు యిలా అంటున్నారు...













కొత్త

## హార్లిక్స్ బిస్కెట్స్

ఇప్పుడు

రుచికరమైనవి, పాలతో నిండినవి, మరియు సంపూర్ణమైన హార్లిక్స్ మంచితనం.

HTA 5456 TEL

కళ్యాణ ఘడియలు కంటికి సొంపు, క్వాలిటీ ఐస్‌క్రీమ్స్ నోటికి ఇంపు
ఇంపు సొంపైన క్వాలిటీ వారి 'బటర్‌స్కాచ్' మరియు 'రెయిన్‌బో' కప్స్

Kwality RAINBOW

LICENSED USERS VBC FOODS PVT LTD TADIGADAPA 521137 VIJAYAWADA
Kwality ICE CREAM
BUTTER SCOTCH

Kwality ICE CREAM

LAA

క్వాలిటీ ఐస్‌క్రీమ్
ఏ.బి.సి. ఫుడ్స్ ప్రైవేట్ లిమిటెడ్.

ఫోన్లు: హైదరాబాదు: 263287, విజయవాడ: 58351, విశాఖపట్టణం: 69397, కాకినాడ: 6525, గుంటూరు: 33588, ఒంగోలు: 3171, నెల్లూరు: 4519, తిరుపతి: 2501, రాజమండ్రి: 2199, ఏలూరు: 21670, వరంగల్: 4921 P.P., కరీంనగర్: 3170, నిజామాబాద్: 22226. ఖమ్మం: 3096,




BOMBAY'S
Kwality
ICE CREAM









5
1




# S PAGE

పాయింట్లు లభిస్తాయి. మీరు ఒక్కరే ఆడుకోవచ్చు. లేకపోతే స్నేహితులతోనూ ఆడుకోవచ్చు. ప్రతి ఆటగాడు తన వంతులో బంతిని 3 సార్లు విసరవచ్చు. మొదటగా ఎవరికి 100 పాయింట్లు వస్తాయో వారు ఆటలో నెగ్గినట్లు.

## రోమాంచిత వినోదం



మనూరిజా అనే భారతీయుడికి ప్రపంచంలో అందరికన్నా పొడవైన మీసాలున్నాయి - 259 సెం.మీ. (ప్రపంచంలో పొడవైన మనిషికన్నా పొడవైనవి!) ఇవి పెంచడానికి అతనికి 13 సంవత్సరాలు పట్టింది!






## నాన్నకి ఒక బుక్ మార్క్!



ఈ బొమ్మని ఒక కాగితంమీద గీయండి (చిత్రం 2) రంగులు వేయండి. దానిని దళసరి కాగితంమీద అంటించి ఆకారం ప్రకారం కత్తిరించండి. మీ దగ్గర మీ చిత్రం విడిగా వుంటే దానిని ఆకారం ప్రకారం కత్తిరించి పైన చెప్పినట్లే చేయవచ్చు. ఇప్పుడు దానిని పుస్తకంలో కాని పత్రికలో కాని పెట్టండి. డాడీ పుస్తకం తెరచినప్పుడు ఆయనకి ఎంత ఆశ్చర్యం కలుగుతుంది.

2

## పిల్లుల సమాచారం!

ఒక పడవలో 10 పిల్లులు వున్నాయి. ఒకటి పడిపోయింది. ఇంకా ఎన్ని వుంటాయి?

జవాబు: ఏమీ వుండవు. ఎందుకంటే అవి కాపీ క్యాట్స్ (Copy Cats)






HTA 7047

బిస్కట్లు అందరికీ ఇష్టమైనవి.

THE KING OF SWEETS

# ఆంప్రో మిల్క్ బేస్

# బడిపిల్లల బిస్కట్






Estd. 1947

**CHANDAMAMA PUBLICATIONS**

**188, N. S. K. SALAI, VADAPALANI, MADRAS - 600 026, INDIA.**

**Phone: 423423, 421778 Grams: "CHANDAMAMA" Telex: 041-347**

*Publishers:*

**CHANDAMAMA—English, Hindi, Telugu, Kannada, Bengali, Gujarati, Assamese, Sanskrit; AMBULIMAMA — Tamil; CHANDOBA — Marathi AMBILI AMMAVAN — Malayalam; JAHNAMAMU — Oriya THE HERITAGE — English**


ప్రియమైన పాఠకులకు,

చక్కని కథలతో, వివిధ శీర్షికలతో చందమామను ఆసక్తిదాయకంగా తీర్చిదిద్దడమంటే మాకెంతో సంతోషకరమైన విషయమే. కాని, పత్రిక ధర పెరుగుదల గురించి తెలియజేయాలంటే మాత్రం ఇబ్బందిగానే వుంటుంది. అందుకే, ఇంతకాలం పత్రిక ధర పెంచకుండా వుండడానికి మా శాయశక్తులా ప్రయత్నించాము. అయినా, కాగితం ధర విపరీతంగా పెరిగిపోయిన విషయం మీకు తెలిసినదే. దానికి తోడు, పత్రికా ప్రచురణకు సంబంధించిన ప్రతి ఒక్క ఖర్చూ అపారంగా పెరిగిపోవడంవల్ల పరిస్థితి మరింత క్లిష్టంగా తయారయింది.

ఈ కారణాలవల్ల పత్రిక ధర పెంచడం తప్పనిసరి అయింది. నవంబర్ '88 నుంచి చందమామ విడి ప్రతి వెల 3-00 రూపాయలు.

ఈ సందర్భంలో మీకొక సంతోషకరమైన వార్త తెలియజేయడానికి ఆనందిస్తున్నాము. పాఠకులకు ఆనందాశ్చర్యాలు కలిగించే విధంగా, నెలనెలా చందమామతోపాటు—విజ్ఞాన వినోదాత్మకమైన సరికొత్త 'అనుబంధం' కానుకగా అందించడానికి ఏర్పాట్లు జరుగుతున్నవి!

సహృదయంతో మా పరిస్థితిని అర్థం చేసుకుని, ఎప్పటిలాగే మాతో సహకరించగలరని ఆశిస్తున్నాము.

తమ విశ్వసనీయమైన,

B. Viswanatha Reddi

ప్రచురణకర్త.

CHANDAMAMA (Telugu) OCTOBER 1988 Regd. No. M. 4854